# విభ్రాంతామరుకము

గణపతిశాస్త్రి





నవ్యసాహిత్యపరిషత్తు
△ గుంటూరు △

# ప్రవేశిక

## ౧

ఇంచుమించుగా పదిసంవత్సరముల క్రిందట శ్రీ పిలకా గణపతిశాస్త్రి, శ్రీ నోరి నరసింహ శాస్త్రి, నేనూ, ఒకనాడు ఇష్టాగోష్ఠిలో ఉండగా ఆచార్యశంకరుల పరకాయప్రవేశము సంగతి చర్చకు వచ్చింది. ఆ వృత్తాంతము కావ్యము చేస్తా నని గణపతిశాస్త్రి, నాటకముగా రచిస్తా నని నరసింహశాస్త్రి అన్నారు. మీ ఉభయుల కృతులూ పూర్తి అయితే నేను పద్యనాటిక చేస్తా నన్నాను. నరసింహశాస్త్రి 'పంచసాయకము' అనే పేరుతో చిత్రమైన ఇతివృత్తము కల్పించి ఉదారవాణిలో క్రమశః మాంకము కొంతవరకు నడిపి సంప్రదాయవిరుద్ధమైన విషయాలు బయలుదేరుతున్నా వని జంకి, సదాచారసంపన్నుడు కావడముచేత, రచన చాలించుకొన్నాడు. మాలో యువకుడూ, ఉత్సాహపరుడూ అయిన గణపతిశాస్త్రి కావ్యము పూర్తి చేసి 'విభ్రాంతామరుకము' అని పేరు పెట్టినాడు. 'కలాభిజ్ఞ' అనే పేరుతో, మార్పులతో, గ్రంథము చేస్తా నన్న నేను నేటివరకూ ప్రారంభము చేయనే లేదు. నాజననకాలమున గురుబుధులలో ఒకరిది నిద్రాసమయమూ, ఇంకొకరిది ఆలస్యసమయమూ కావడముచేత రచనమీదికి మనసు మొగ్గలే దనుకోవచ్చును.

## ౨

రచించకుండా ఉండడానికి ప్రధానకారణము వేరే ఉన్నది. పరమహంస పరివ్రాజకాచార్య జగద్గురు శ్రీ శంకర భగవత్పాదులవంటి మహాపురుషుడు - మహేశ్వరఅపరావతారము - పరకాయప్రవేశము చేసినట్టు వినడము అద్వైతులకు శ్రవణశూలమువలె ఉంటుంది. ఈ కథ అద్వైతద్వేషులు కల్పించిన దని ఘంటాపథముగా చెప్పవచ్చును. శంకరవిజయ గ్రంథములో ఈకథ కనపడుతుంది. శంకరవిజయము విద్యారణ్యవిరచితము అని ప్రసిద్ధి. కాని అలీకకథలు అన్యు లెవరో గ్రంథములో అంతర్భూతము చేశా రని కొందరు పురాతత్త్వవేత్త లన్నారు. అన్ని విషయములూ పరిశీలించిన జగద్గురు శ్రీ కల్యాణానంద భారతీ మహంతాచార్య స్వామిపాదులు పరకాయ ప్రవేశకథ పాషండకల్పిత మని ఖండించినారు,

## 2

బాల్యములో ఈకథ పెద్దలవల్ల విన్నప్పుడే అలీకమని అనిపించింది. సర్వజ్ఞమూర్తి శంకర భగవత్పాదులు కామకలావిశేషము గ్రహించడానికి పరకాయప్రవేశము చేయవలెనా! బృహదారణ్యకోపనిషద్భాష్యములో మంథాకర్మను గురించి శంకరులు వ్రాసిన పంక్తులనుబట్టి ఆ మహనీయునికి కామతంత్రము కరతలామలక మని స్పష్టము అవుతున్నది.

## 3

శంకరశబ్దవాచ్యు లెంతమంది? ప్రస్థానత్రయభాష్యములు లోకానుగ్రహబుద్ధ్యా రచించి అనుగ్రహించిన శంకరులు ఒకరు; ప్రపంచసార తంత్రాదిగ్రంథకర్త తాంత్రికశంకరుడు ఒకడు: వివిధదేవతాస్తోత్రాదులు చెప్పిన శంకరుడు మరొకడు — మొత్తము ముగ్గురు శంకరులని పురాతత్త్వవేత్తలు అన్నారు. బ్రహ్మసిద్ధి గ్రంథకారుడైన మండనమిశ్రుని శంకరులు వాదములో ఓడించినట్లూ, అప్పుడు మిశ్రునిభార్య ఉభయభారతి తనను జయిస్తేనే కాని ఆచార్యుల విజయము పూర్తి కాదన్నట్లూ, కామకళను గురించి ఆమె ప్రశ్నించినట్లూ, ఆజన్మబ్రహ్మచారి అయిన ఆచార్యశంకరులు ఆరుమాసముల వ్యవధి కోరినట్లూ ఐతిహ్యము. మండనమిశ్రుడూ శంకరులూ సమకాలికులు కారనీ, మండనమిశ్రుడు ఓడిపోయి సన్యసించి సురేశ్వరాచార్యనామము ధరించినా డనడము అసంభావ్యమనీ, కుప్పుస్వామి శాస్త్రి బ్రహ్మసిద్ధి విమర్శలో వ్రాసినారు. గృహస్థు జీవన్ముక్తుడు కావచ్చునని బ్రహ్మసిద్ధిలో ఉన్నది సన్యసించనిదీ జీవన్ముక్తి లభించదనే ఆశయము కల ఆచార్యహృదయానికి పైగ్రంథతాత్పర్యము విరుద్ధము. మండన మిశ్రుడు నిజముగా ఆచార్యశిష్యు డయి ఉంటే ఆయభిప్రాయము మార్చుకొని ఉండేవాడే. సురేశ్వరాచార్యుడు ఆచార్య శిష్యు డనే మాట నిజమే. ఉభయభారతికి భర్త బ్రహ్మసిద్ధికర్త అయిన మండనమిశ్రుడు సురేశ్వరాచార్యుడు కావడము చాలా సంశయాస్పదము.

## ౪

ఇక ఎవరి కాయములో ప్రవేశము జరిగినట్టు? అమరుక మహారాజు కళేబరములో ఈప్రవేశము జరిగినట్టు గదా ఐతిహ్యము? ఇతిహాసపరిశోధకులు ఇచ్చిన రాజవంశావళులలో ఎక్కడా అమరుక మహారాజుపేరు కనపడదు.

### ౩

కవి రమరః కవి రమరుః
కవి రభినందశ్చ కాళిదాసశ్చ

అనే శ్లోకమువల్ల అమరుకకవి ఉండేవాడని గోచరిస్తుంది. అమరుక కవి విరచితమైన అమరుశతకము జగత్ప్రసిద్ధము. స్వార్థములో కన్ ప్రత్యయము చేరి అమరుడు అమరుకుడు అయినాడా ? కాక ఉభయులూ భిన్నులా ? నామలింగానుశాసనకర్త అమరసింహుడు జైనుడు. శివభక్తి కల అమరుకవి ఇతడు కావడానికి వీలులేదు. అమరుకుడనేరాజు అమరుశతకము చెప్పినాడని విచక్షణ లేనివిద్వాంసులు అంటూ ఉంటారు. రమారమి 15 సంవత్సరముల కిందట వంగదేశ విద్వాంసుడొకడు అమరుకకవి స్వర్ణకారుడని నిరూపించినాడు. కవి స్వర్ణకారుడు కావడముచేతనే పద్యాలలో నాజూకూ, నగిషీ స్ఫుటముగా కనబడతవి. అమరుకకవి శరీరములో ఆచార్యుడు ప్రవేశించినట్లు ఏధూర్తుడుకూడా వ్రాయలేదు. కాబట్టి ఏవిధముగా పరిశీలించినా పరకాయప్రవేశప్రసంగము పరాస్తమై పోయింది.

విగతజీవులలో ప్రవేశించకుండా సజీవులనే యోగశక్తివల్ల ఆవేశించేపద్ధతి ఉన్నది. మహాభారత ఆనుశాసనిక పర్వములో, దేవశర్మశిష్యుడు విపులుడనేవాడు గురుభార్యను కామించి వచ్చిన మహేంద్రుని వండలించడానికి శచీదేవిని యోగమార్గాన ఆవేశించి ఆమెచేత అతనిని చీవాట్లు పెట్టించినాడు. ఇంద్రుడు ఆశ్రమము విడిచిపోగానే విపులుడూ గురుపత్నీ యథాప్రకారముగా ఉన్నారు.

ఆచార్యుని కంటగట్టిన పరకాయ ప్రవేశకథ పైశాపాఖ్యానము వంటిది కాదు.

### ౪

నిరాధారములైనా నిజముగా జరిగినట్లు కొన్నికొన్ని వృత్తాంతాలు లోకములో వ్యాప్తిలోకి వస్తవి. రాజమహేంద్రవరప్రభువు రాజరాజనరేంద్రునికి చిత్రాంగి అనే భార్యా, సారంగధరుడనే కుమారుడూ ఎన్నడూ లేకపోయినా ఇప్పటికీ రాజమహేంద్రవరములో చిత్రాంగి మేడ, సారంగధరునిమిట్ట, అనే పేరుతో రెండుజడపదార్థములు కనిపిస్తూ ఉంటవి. చిత్రాంగీ సారంగధరులను గురించి పద్యకావ్యములూ నాటకములూ బయలుదేరినవి.

జరగని విషయములను గురించి కావ్యాలు రచించ కూడదా? రచించవచ్చు. ఉత్పాద్యవిషయములు కూడా ఉచితములే. అలీకమైనా ఐతిహ్యము ఉంటే అంగీకరిస్తారు సమీక్షాదక్షులు.

కవికర్ణములకు కమనీయముగా గోచరించే విషయాలకు సరసకావ్యాకృతి సమకూరడము సమంజసమే.

౬

ఈకవి ఇతివృత్తములో హేయభావము ఏమీ సంక్రమించనీయకుండా కమనీయముగా కల్పన చేసినాడు. ఆఖేటము, ఆపద, ఆగమనము, ఉజ్జీవము, కింశుకప్రభానాట్యాదికములు, ప్రభుప్రమోదకేళులు ప్రథమాశ్వాసములో బాగా వర్ణించినాడు.

ద్వితీయాశ్వాసములో ప్రబోధము, మథనము, ప్రత్యభిజ్ఞ, అమాత్యుల ఆందోళన, కింశుక ప్రభాప్రణయము, శిష్యుల బృందమేళ, పరిసమాప్తి ఉపజ్ఞాన్వితములై, ఉత్సాహదాయకములై, రసపర్యవసన్నములైనవి. నిర్వహణంలో నేర్పు కనబడుతున్నది.

గణపతిశాస్త్రి కవిత్వంలో మాధుర్యం జాలువారుతూ ఉంటుంది. శబ్దమాధుర్యమూ, శబ్దసంఘటనామాధుర్యమూ, అర్థభావమాధుర్యమూ అధికముగా ద్యోతకమవుతవి. ధారాశుద్ధి, రచనారమణీయత ప్రస్ఫుటములు. వివిధవృత్తములను ఈకవి సామర్థ్యములో సరసముగా నడిపినాడు.

బహువర్షములు సంస్కృతకళాశాలలో పరిశ్రమవల్లనూ, నవ్యకవుల సాంగత్యమువల్లనూ, ప్రాచీన నవీనభావసమ్మేళనము ఈ కవి హృదయంలో సరసముగా సంఘటిల్లింది. విద్యావ్యాసంగమే కాక విచక్షణకూడా కలవాడు కావడంచేత ఔచిత్యహాని లేకుండా ఆదినుంచి అంతమువరకూ కవి గ్రంథమును నిర్వహించినాడు.

'విభ్రాంతామరుకము' వంటి ఉపకావ్యము ఆధునిక సాహిత్యములో లేదు. ఒక కావ్యముతో మరొకకావ్యమును పోల్చటము భావ్యము కాదేమో! కాని, ఈయన రచించిన 'ప్రమద్వర' అనేకృతి ఇంతకన్నా రమణీయము.

ఈయన కవీంద్రుడు కావలె నని నాఆశీస్సు! ఇతి శివమ్!

గుంటూరు
1-9-1946

శివశంకరశాస్త్రి

# ప్రథమాశ్వాసము

భారతవర్ష మధ్యమణి భాసురముం గమనీయ సౌధ వీ
థీ రమణీయముం బహుళ దేవకులాంచల మాలికా కపో
తీ రవ మంద్రఘోష మవధీరిత దివ్య పదమ్ము, చంద్రప
రా రుచిరాభిధాన మధురమ్ము పురమ్మది మాళవమ్మునన్

ఆ పురి రాజధానిగ నిరంతర భోగములం బ్రపూర్ణ తా
రాపతి లీల రాజనికరమ్ములు గొల్వ నశేష భారతా
ద్వీపతియై నితాంతము నరిందముఁడై వెలుగొందు భారత
శ్రీపరమేశుఁ డెల్లపు డసిన్నుటియించు జయేందిరా ప్రథన్

అమరుక దేవుండను నా
మమువనె లోకమ్మునం బ్రమాదాదిక మం
తము సేయుచుం బ్రజానీ
కము బాలించుం బతిప్రకామ శాంతిన్

అమరుక దేవ భారత మహాప్రభు వర్యుఁడనం బ్రసిద్ధ భూ
తమణి హృదంతరమ్ములఁ గరమ్ముపసేవితుఁడై సమస్త భో
గముల మహేంద్ర వైభవసుఖమ్ముల నెల్లపుడుం దలిర్పు నా
యమరుక భూమిజాని, వనితావన సీధుర పైక లోలతన్

ఆజానులంబి బాహా గభీరాకారుఁ
డరుణరేఖా మనోజ్ఞాంబకుండు;
కమనీయ విపుల వక్షస్సింహ మధ్యముం
డమరీ ముఖోల్లస దమృతమూర్తి;
మృదు మిత వాగ్వశంవద మంత్రి సామంతుఁ
డతిలోక భోగ తోషిత హృదయుఁడు;
లలిత కళాస్వాద లాలస మానసుం
డళినీల కుంతలా లులిత హృదయుఁ;

డమ్మహీజాని సర్వధరాధినాథ
వందిత పదమ్ముల నిలా పురందరుండు;
అమ్మహారాజు రాజసమర్పితాంగ
నా నయనరాగ నీరాజితాననుండు.

సచివాయత్త సమస్త రాజ్యభర విశ్రామమ్మునం గామినీ
రచితావాస విలాసనృత్యముల నారామమ్ములం దోలికా
ప్రచలల్లాస్య విలాసినీ దృఢ పరీరంభమ్ములం గామినీ
నిచయమ్మందు రమించు నెందు లలవానీక ప్రసూనాళియై

అతని సీధుపాన సమయమ్ముల బంగరు పానపాత్రలం
జ్యోతుల లీల నేత్రయుగ శోణ మృదుప్రభ లుల్లసిల్ల, సం
జాత మదారుణాస్యలు విశాల విలోచన లా నృపాల కాం
తాతిలకమ్ము లుల్లము వితాంతము వింతురు లాలసాళలన్

తన లలితాంగుళీ నఖ వితానములం బ్రతిబింబ రమ్య న
_ర్తన మగు రత్నతూలికఁ గరమ్మున మెల్ల విదల్చ, విద్రరేం
ద్రుని ధనువుల్ దళుక్కన వధూ మధుమత్త కపోల శోభలం
జనపతి చిత్రమూర్తుల నచంచల వీక్షలఁ గూర్చు రాత్రులన్

పరిపరి లోల నిస్వన విపంచికలం గడుఁ జొక్కి చొక్కి, మం
థర పద నూపురాంచిత వితంబిను లాడ, మృదంగ వాదనా
నిరత కరాంగుళీయక మణిప్రభలం దల యూచి యూచి, యం
తరమున భూమహేంద్రుఁడణుమాత్రముఁదృప్తిగనందొకింతయున్

ఒక్కొక వేళ తేఁడు మృగయోత్సవ లాలసుఁడై చరించు, వే
తొక్కపు దక్షకేళి దిన మొక్క విశేషముగా గతింపఁ గై
పెక్కిన వల్లభాళి పులకించు కపోలము లింపు గూర్పఁ గ్రొం
జక్కెర వోని చుంబన మొసంగి పఱమ్మాగఁ, జిమ్మ నెత్తముల్

అవిరళ కావ్యగోష్ఠిఁ గవితాంతర తత్వ వివేచనమ్ములం
గువలయ చక్రవర్తి చెలగుం బ్రమదమ్మున; నొక్క మారు మా
ధవ పరిఫుల్ల మల్లిక బెదం దనుపన్ బొదరింఢ్లలో మహా
కవి వలయమ్మునం గను సుకమ్మ విచిత్ర కవిత్వరీతులన్

ఈ విధి నద్ధరాపతి సమీహిత భోగము లందుచుండ ను
ర్వీవిభుఁ గాంచి, కొంద ఱటవీచరు లెంతయు భక్తి, "మానవేం
ద్రా! విపినమ్మునం బలు మదమ్మునఁ గ్రొవ్వె మెకమ్ము లెల్ల, దే
వావసరమ్మొకండె! మృగయాచరణమ్మువ"కంచుఁ దెల్పినన్

ఖటవికాళి నా నృపుఁ డనంతర మెంతయు నాదరించి, యా
ఖేటక యాత్ర కాట బవిచె న్నగరమ్మున; బోయలుం జటా
జూటము లల్ల జారి పడుచుం భువి నంట నరేంద్రు మ్రొక్కఁ, యా
ప్వీట శిఖాత్కరమ్ము దరభీతిగనం జవి రుల్లసమ్మునన్

జనపతి యంతఁ గుందవిలస జ్జవనాశ్వము నెక్కఁ, భామినీ
జన మల నల్లనల్లన విశాల గవాక్షములం గనుంగొనం
జనె మృగయారతిం గరకళా చలన మ్మయి నంతఁ బాదఘ
ట్టన చల విస్ఫులింగ ఘన టంకృతి నశ్వము పర్వులెత్తగన్

పచ్చని తోరణమ్ముల విభాసిలు పౌరగృహంబులం బతా
కోచ్చల రాజసౌధ మృదుహుంకృతి రమ్య కపోతపాళి చం
చచ్చల పక్షి నిస్వన వశమ్మునఁ బౌరుల వేడ్కలం బురం
బచ్చెరు వయ్యెఁ జూపఱ కనంత గృహాంగణ రంగవల్లులన్

భేరులు మ్రోగె నప్పురి గభీరముగం జననాథ సౌధ శం
ఖారవ మిశ్ర ఘోష; మృగయా ప్రమదమ్మున బౌరు లెల్ల సం
చారము లాపి, యొక్క వరుసం జయ వెట్టగఁ బుణ్యకాంత లం
కూరిత కంకణ క్వణిత ఘోషల హారతు లెత్తి రెల్లెడన్

అతని నాఖేటక వే
షాతిమనోహరు మహోన్నతాశ్వ చరణ సం
జాత మృదుమృదంగ ధ్వని
పాతమ్ముల ననుసరించి పరువిడి రధిపుల్

ఠేవికి వెంట వెంట ముఖరీకృత చంచల పాద కింకిణీ
స్వానము మ్రోయఁ జంచువులఁ జట్టుపలం దగఁ జీల్చుచుం ధను
ర్బాణము లీలఁ బుల్గుల నభమ్మునఁ గన్గొను సాహసమ్ములం
బూని. నృపాలసేవకు లపూర్వ ముదమ్మున నేగి రంతటన్

కణకణ లాడు వహ్నికణ కాంతులఁ గన్గవ లుల్లసిల్లఁ గాం
చన గళశృంఖలా రుచి హసన్నవభాను కరాంకురమ్ములం
గను మిఱుమిట్లు గొల్పు నవకమ్ములఁ బర్వెడు జాగిలమ్ములం
గొని చని రమ్య లాళ్వ గళ ఘుర్ఘుర ఘోష లెద ల్గదల్పగన్

వాగుర లూని కొందఱు నృపాలునితోఁ బరువెత్తఁ గొందఱుం
దే గరువమ్మునం జిఱుత నెక్కటి కయ్యమునన్ వధింతు మెం
తే గణనీయ మియ్యది యొకింతయు గైదువు లొల్ల మంచు నే
వో గురు వాగ్వివాదముల నందుదురుం దమలో దమంతటన్

బారులు దీర్చి వీథికలఁ బౌర జనమ్ముల బాల బాలికా
వారము లోల కుంతల నివారిత వీక్షల ఠేవిఁ జూడ మం
దారవమై గభీర పటహమ్ముల హుంకృతి శాంతి నందఁ గాం
తారముఁ జొచ్చె భూవిభుఁ డెదం బరిఘూర్ణిత మోద వార్నిధిన్

అమరుక దేవ భూపతి యనంతర మాటవికాళి తూర్య సం
భ్రమ వినదమ్ములం భయ చర న్మృగ పంక్తుల వెల్వరింప ను
త్తమ రయవత్తురంగమ పదక్రమణమ్ముల మౌళి కాంతులం
దము లొలుకం జరించె విపినమ్మున నమ్మృగయా విలోలతన్

గహన గుహాంతరమ్మున సుకమ్మగు నిద్దురఁ దూలి, తింత్రిణీ
దహన విశీర్ణ కీలల విధమ్మునఁ గన్గవ వెల్గు బెబ్బులిం
బ్రహత ధనుర్గుణారవ లవమ్మున మేల్కనఁ జేసి, చాతురీ
మహిమ సురేంద్రచాప మూపమానముగం దరవాతిఁ జీలిచెన్

కడు వడిఁ బర్వు లెత్తి విశిఖమ్ముల కందక, తీవ్రభీతి నొ
క్కెడ మెడద్రిప్పి కన్గొని, యనేక విధమ్ములఁ బారి, నెవ్వగం
దడఁబడు జంతురాజి వసుధావిభుఁ డొక్క శరమ్ముతోన వెం
బడి వధియించు నాటవికవర్గము దన్గొనియాడి, మెచ్చగన్

సలిలమునుండి వెల్వడి విశాలవనాంతర పల్వలమ్ములం
గలఁచుచుఁ దీరభూమి వడిగం బరువెత్తు వరాహపాళి న
గ్గలమగు బాణసంహతి నొకండయి వ్రయ్యలు సేసినంత నె
చ్చెలు లొహొహో! యనం గహనసీమఁజరించునృపాలుఁడాదటన్

సుందర బర్హమై వనవసుంధర నృత్య మొనర్చు కేకి జం
పం దనవింట తూపు నరపాలకుఁ డెక్కిడునంత బర్హిణీ
కంధర దీనరావ మెసగం దరుశాఖిక దానిఁ గాంచి, తా
లిం ధరణీమహేంద్రుఁ డవలీల శరమ్మడచెం గుణమ్మునన్

ఒక్కొక మాఱు కాననజనోదిత మార్గమునందు, రూపునం
దిక్కరి సన్నిభమ్మగు మదించిన హస్తి చెలంగ, జంతులం
దక్క వధింప నొప్పదు వనస్థలి నేనుగు నంచు నవ్విభుం
డక్కటికమ్ము నెమ్మనొలయం గరి బట్టు విచిత్ర చాతురిన్

సాళవముల్ చలింపగ దిశావలయమ్మున వాయువేగ సం
చాలిత శీర్ణపర్ణవివశ భ్రమణమ్ములఁ బిఱ్ఱలెత్తు వా
చాల విహంగపాళి వరుసం బడఁగొట్టు భువిం ధనుర్గుణా
స్ఫాలన చంచలాశుగ రవమ్ములఁ దిక్కులు పిక్కటిల్లగన్

బెదరిన జంతుసంహతి విభీతవిలోకనమై. వనమ్మునం
బదముల చిత్రకాంతి, బహుభంగులఁ గన్గవలం జెలంగి యుం
పొదవ, నొకే రయమ్మున ముహూర్తమునం బరువెత్తు నశ్వముం
గదలి యదృశ్యమై మెరయగం దటమున్ నృపుఁ డమ్మృగావళిన్

ఘోరవి మ్రోగు భేరుల నభోజలదావళి భీటవాటుఁ, గాం
తార గుహాంతరమ్ముల ఘనస్వన కేసరి గర్జలంత. హుం
కారమయమ్ములై వలుమొగమ్ములఁ బర్వ వనమ్ము సర్వ మ
వ్వీర నరేంద్రు గాంచి మొరపెట్టు విధమ్మునఁ దోచె నెల్లెడన్

క్రమముగ భానుకాంతి విశిఖమ్ముల రీతి భరింప రాని ఘ
ర్మమున వెలుంగఁ జొచ్చిన ధరారమణుండు మొగమ్ము గ్రమ్ము ము
త్తెముల సరమ్ములై వడి బథిశ్రమవారి దొరంగ నవ్వనాం
తమునఁ దురంగధావన పదస్వన మంటఁ జరించె నొంటిమై

తురగపద ధ్వనుల్ శ్రుతి సుదూరము సోఁక, మృగేంద్ర మొందుకం
దరమదురం ధ్వనించె వసుధం దన మోము నమర్చి దీర్ఘకే
సర తతి గర్జనానిలవశమ్మున నూగి జలింపఁ గాననాం
తర మృగయూథముం ద్రుతపదమ్ముల నెల్లెడఁ బిఱ్ఱలెత్తగన్

వేట తమిన్ నృపుండు పృథివీపతి వర్గము వీడి, నిత్య మా
ఖేటసహాయులై తనకొగిం బరిచర్యలు సేయు చిత్రవే
షాటవికాళి దవ్వుల రయమ్మున మార్గము దప్ప సత్వరా
ఘోటకమున్ హరేంద్రగళఘూర్ణిత మా గుహం జేర్చె బ్రేల్మిడిన్

అనుచరవర్గ మంత మనుజాధిపుం గానక వాజి పద్ధతి
ధ్వని వెనువెంట సత్వరపదమ్ములం బర్వులు వెట్టు నంత న
జ్జనవిభుండం ధనుర్గుణ విసారిత హుంకృతియై మృగేంద్ర గ
ర్జన నినదమ్ము మ్రోగిన దెసం గుహ నేసె నిశాతబాణముల్

అరుణ విలోచనమ్ముల గుహాగత సింహ మనంతరక్షణాం
తరమున దాటు వైచి, బహుధా స్రవియించు కవోష్ణశోణిత
మ్మురలి శరీర మెల్లెడలం బూచిన కింశుకమై జ్వలింప న
న్నరపతిశీర్షముం బదమునం బ్రహరించె విలోల జిహ్వామై।

దానిపదాహతిం దన యెదం బలితమ్మగు దిమ్ము గ్రమ్మ చం
దాన విమోహముం గను విధమ్ము దలంచియు నా నృపుండు బా
హా నిశితాసి లంఘితమృగాధిప శీర్షము ద్రుంచి వైచె నా
శోణగళాస్రముల్ దొరగుచున్ భువి కాల్వలు జాలు వారగన్

మృగరా జుగ్రగళారవమ్ము గుహ గంభీరమ్ముగా మ్రోయ ద
వ్వగ నేలం బడెం గంఠతుండములు సంపూర్ణమ్ముగా వీడి; యు
జ్జగతీనాథుండు మూర్ఛ నంది పడె నశ్వస్కంధమం దంత ని
మ్ముగ వార్వమ్మది యెంచి మెల్లం జనె నా భూమీశు రక్షింపగన్

పరిచరవర్గ మంత నరపాలక మార్గము రోసి, రోసి, మం
థరపదమై నరేశ్వరు వనమ్మున ప్రోయుచు నంతనంత భీ
కర గళహేషలం దమమొగమ్మయి వచ్చు తురంగముం బ్రజే
శ్వరు దరభీతిఁ గన్గొని ససంభ్రములై పఱతెంచి రొక్కటన్

ఆవిధి వేగ దగ్గరి హయమ్ముననుండి నృపాలు దించు వా
రై వనవల్లరీ కిసలయమ్ములఁ బల్లవశయ్యఁ గూర్చి భూ
మీవిభు నందు జేరిచి. సమీప సర స్సలిలమ్ములన్ మృణా
ళావళిఁ బద్మపర్ణ వివహమ్ముల నన్నిటఁ దేర్తు రవ్విభున్

ఎన్నివిధమ్ములైన మనుజేశున కింతయుఁ దెల్వి రామి నా
సన్నజనేశు లవ్విభు దెసం బరికించి, మృతిం దలంచి, కా
దన్న వనేచరోక్తుల ననంతర మేదియు విశ్చయింప కా
పన్నమనంబులన్ శిబికపైఁ బురిఁ జేర్చిరి వేగమే ప్రభున్

నగరజనమ్ము లెల్ల నయన చ్యుత బాష్పములన్ నరేంద్రు గాం
చగఁ బరివార మా నృపు వెసం బువు సెజ్జ శయింపఁజేయ మె
ల్లిగ నవరోధ మంతర గళమ్ముల రోదనవాద మంకురిం
పగ నవగుంఠనాంతరిత ఫాలవిభూషల దేవి గన్గొనెన్

అనుపదమం దచంచలళయాను బతిం బరికింపగ వేగధా
వన బహు ఫేనిలాశ్వము జవమ్మున డిగ్గిన రాజవైద్యుఁ డొ
య్యనఁ బఱతెంచుటం గని నృపాంగన లంత విలోల కంకణ
స్వనముల మేల్ముసుంగుల కొసల్ దిగఁజార్చి తొలంగి రిట్టటున్

నీరవభాషణమ్ముల వినిశ్చల చామర ధారిణీ కరాం
భోరుహ లీలలం బ్రకృతిముఖ్యుల రాకల శాంత వైద్య సం
చారములన్ నరేంద్రపరిచర్యలకై పరువెత్తు చేటికా
వారమునన్ గనంబడె నృపాల గృహమ్ము ససంభ్రమమ్ముగన్

అమరుక ధారుణీశ్వరుఁ డనంతర మా పరిచారికా సవి
భ్రమకృత సేవలం గుశల వైద్య మహౌషధులం దుదిం బ్రశాం
తముల విలోచనమ్ములఁ గనందొడగెం దనవారి నా నిమే
షమునఁ గడుం బ్రమోద వివశ మ్మయి బాంధవ రాజి వెల్గగన్

దినదినముం గ్రమక్రమ విధిం దగు నౌషధసేవ నా నరేం
ద్రుని తనువంత సత్వర విధూత రుజమ్మయి దార్ఢ్యమందె; న
జ్జనవిభుఁ గాంచి, పౌరులు ససంశయ విస్మయ మందఁ దీవ్రభా
నుని కిరణమ్ములం గడు వినూత్నవిధమ్మున వెల్గు నాతఁడున్

అనుదిన రాజ్యకార్య నివహమ్ములఁ బూర్వము రీతి బాలన
మ్మొనరుపఁ జేయుఁ గాని, కలనున్న విధమ్మున తేఁడు పూర్వవ
ర్తనమును విస్మరించి, బహుధాస్మృతి నందిన లీల మంత్ర భా
షణముల కుత్తరమ్ముల నొసంగు నమాత్యులు బిచ్చపోవగన్

అవరోధాంగన లెల్లరుం గొలువ నుద్యానాంతరాందోళికో
త్సవ హర్షమ్ములఁ దేలు వేళలఁ బ్రమాద మ్మంది, యన్యాంగనా
నవనామమ్ముల రాణులం బిలిచి యా న్నారీమనోమానశాం
తివిధానమ్మునకై గ్రహించు మృదువాణిం బాదమందారముల్

ఆ రాజన్యుని దర్శనక్షణ మలభ్య మ్మయ్యె దర్శింప నే
తేరంగోరు నమాత్యవర్యులకు నుంతేని స్నేదందం గృపా
పూరమ్మింంచుక జాలువారఁ దనమోముం గొంతఁ జూపించు నె
వ్వారైనం బ్రభుఁజేర నోడుదురు సంభాషింప రాజ్యాంగముల్

పూర్వమె భోగశీలుఁడధిపుం డిపుడెంతయు మించి హృద్యగాం
ధర్వకళాది చిత్ర వివిధ ప్రమదమ్ముల మత్తలాసికా
పూర్వ దృఢోపగూహన కవోష్ణసుఖమ్ముల రాజమందిరాం
తర్వరవర్ణినీ హృదయ దర్పకుఁడై చరియించు నిచ్చలున్

యామినులందు లాస్యవలయమ్ముల నృత్యమొనర్చి సోలు కాం
తా మృదితాధరమ్ముల మదప్రమద మ్మదిగాని, నర్తకీ
భామినులిచ్చు పూర్ణమధుపాత్రల వెల్గు తదీయ లోచన
శ్రీ మనసారఁ గ్రోలు వివశీకృతిగాని రుచించు తేనికిన్

జీవనమో సమస్తము విచిత్రమనోహర పానశాల యా
జీవవిలోచనాధర సుశీతల శీధువు హృద్యమద్య మా
శావలయమ్మువం దన వశమ్ము సమస్తము భోగభాగ్య మా
యా వివిధేంద్రియానుభవ హర్షసుఖమ్ముల మున్గు తేనికిన్

అవిరతరాగ లోలత నిరంతరముం దనియింప నిచ్చలుం
భువన మహేంద్రుఁడై నిమిషముం బోలి వోవగ నీక సర్వముం
దివస మనేకలీలల మదిం బ్రియహర్షములందు, భోగమే
యవధి సమస్తజీవన మహోనుమవల్లి కటంచు నెంచెనో !

అతని నవ్య నవ్య విషయమ్ములయం దనురక్తి, విత్యమా
రీతిఁ గ్రమక్రమాధికత నందిన భూపరిపాలనాది కా
ర్యాతివిరక్తియుం గని, యహర్నిశలుం దమలోన విస్మయో
పేత మనస్కులై కళవళింతురు మంత్రు లొకే విధమ్ముగన్

ఎన్నఁడుఁ గాని లేదు మనుజేంద్రుఁ డదేవిధి భోగలాలసా
పన్నమనమ్మునం ధరణి పాలక ధర్మము విస్మరించి, యోషి
న్నయన ప్రభా తరళ సీధు రసమ్మునఁ జేసి, యింత వి
చ్ఛిన్నతఁ గొన్న భావవివశీకృతి యంచవి రెల్లవారలున్

కొందఱు మంత్రు లా విభునకుం దొలి నుండియు నర్తకీ కళా
నంద వినోద లాలస మనమ్మన నుండుట యెంచి, యంతనం
తం ధరణీవిభుం దనుదిన మ్మతిలోలుపుఁడైన, తేవి మా
న్పం ధృతి మాలి, భావి దెలుపం గణికావళిఁ గోరుచుందురున్

వేటకుఁ బూర్వ మింత పృథివీపతి విస్మృతి లేమి, యంత నా
నాటి నిమేష మాధిగ మనమ్మునఁ బూర్వము సంస్మరింప నా
రాటములం బదమ్ములఁ బరస్పర మర్థవిరోధ ముండుటం
దోటి యమాత్య మండలి సుదూర మహాద్భుత మందె నెంతయున్

తుదకుం గొందఱు మంత్రివర్యు లెదలం దూరమ్ము భావించి యు
న్మదితాంతః కరణమ్మునం బ్రభువు నానాలీలలన్ రాజ్యసం
పదలం భోగము లందుటం బహుళ విశ్రాంతిం గనం గాంచి, నె
మ్మది యోగీంద్రుఁ డెవండొ సొచ్చె నని సంభావింతు రా తేవికిన్

ఎటులైనం దుదినిశ్చయింప నిసుమంతైనం బ్రమాణమ్ము లే
కటులే సందియ మందుచుం జనవిభుం డా భోగభాగ్యమ్ములం
దుటకుం దాము నొకింత సర్వగతులం దోడ్పాటు గావింపుచుం
డుట దోపం బహుళంగులన్నడతు రాందోళన్మహామాత్యులున్

పరకాయమ్మను విద్య నెవ్వ రవనీ పాలుం బ్రవేశింపఁ ద
త్తరుణీ లోల కటాక్ష వాగురల చేతం బద్ధులై పోయి రా
గరసాస్వాదమునం బ్రమత్తులయి యింకం బూర్వరాజేంద్ర మా
ర్గరుచిం బొందిన మేలగుం బ్రజకు నిక్కమ్మందు రెమ్మెఁగనన్

ఆ విధి సందియమ్ముల నొకంతఁ దమంతన వీడి, మంత్రు లా
యా వివిధేంద్రియానుభవ హర్ష రుచిం జననాథుఁ గొంత రా
జ్యావసరమ్ములం దనునయమ్మున నిల్పగవచ్చు నన్న కాం
క్షావిధి సర్వభోగము లొసంగి ముదం బొనగూర్తు రప్పిటన్

జనపతి మాత్రమో సుఖవశంవదుఁడై హృదయమ్మునం గ్రమ
మ్మునఁ దనమంత్రిమండలి కపూర్వము విస్మయ ముద్భవింప నం
గనల విలాసగోష్ఠుల నొకప్పు డొకింతయు వీడ కాత్మద
ర్శనము నొసంగకుండ మదిరా పరతం జరియించు నెప్పుడున్

ఆ గతి రాగలోల హృదయమ్మున నవ్విభుఁ డుండు నంత నె
న్నో గడచెం దినమ్ములు ముహూర్తములై, మఱి క్రొమ్మెఱుంగుఁబో
లై గతియించె మాసనిచయమ్మిక నెవ్విధి నైనఁ దొంటి రూ
పై గురుభోగ లాలస నహర్నిశలం గడపుం బ్రజేశుఁడున్

ఇటు లానందమయాంతరంగమున భూమీశుండు వర్తించె; నం
తట లీలా భవనాంతరమ్మునఁ బ్రశాంత స్వాన వీణా నట
చ్చటులాగ్రాంగుళులన్ గనుంగవ వికాసమ్మొది సోలం దనం
తట గానోన్మదమందె నాతఁడొక సంధ్యాశేష వేళ ప్రథన్

ఆ సాయంసమయమ్మునం బ్రభువు రాగాస్వాదలోలుం గనం
గా సీమంతిని యోర్తు వచ్చి నిలిచెం గానోచ్చలద్రాగిణీ
శ్రీసౌందర్యమునన్ నృపుండపుఁడు నారీమూర్తి నీక్షించి వీ
ణాసంగీత మొకింత మాని కనెఁ గాంత న్నిశ్చలాక్షిద్వయిన్

కోమలి యంత నా విభునకుం భువి ముంగురు లంట మ్రొక్కి శో
భామహిమమ్మునం దన విభాస్వర రూపము సౌధ చంద్రకాం
తామల భూమి నుజ్జ్వల మహమ్మున వెల్గ వినీత మంద భా
షామృత నిర్ఝరిం బరపె నా నృపశేఖరుఁ గూర్చి యివ్విధిన్

ఓ నరపాలమౌళి కిరణోజ్జ్వలపాదుక! దేవ! వల్లకీ
గానరస మ్మొకింత కలగం బరిచారిక హేతు వయ్యె; నా
పై నెనరుంచి యించుక కృపాపరులై తమ కింశుక ప్రభా
దీన నివేదన మ్మది మదిం గొనుపం గరుణింప వేడెదన్

"దేవర! విన్నపమ్మిది మదిం దలపం దగు నేటిరేయి నా
నావిధ నృత్యభంగిమ గనం బ్రభుఁ గోరెదుఁ బాదదాసి మి
మీత్రవిధిఁ గింశుకప్రభ; యొకించుక నాకయి దేవ నృత్య శా
లావరణమ్ముఁ జొచ్చిన మహాముద మందుచు ధన్య నయ్యెదన్"

ఇది చెలి కింశుకప్రభ వచించెను దేవరకై ప్రమోదమం
దెదఁ దమ రించుకేళియు మదిం గరుణించిన; నే ననుజ్ఞఁ గో
రెదఁ జెలికై సమస్త మొనరించిన కృత్య మెరుంగఁ జేయ; నే
గెద నెలవిందు నెమ్మది సఖీవచనమ్ముఁ దలంపుఁ డాదటన్

అని వచియించి యామె వినయమ్మున నవ్విభు పాదపీఠ వం
దన మొనరించి, మెల్లగ వినమ్రముఖమ్మున నేగె; నల్లన
ల్లన విభుఁడుల్లమందు నవలా వచనమ్ముఁ దలఁచి, వల్లకీ
స్వన మొక భృంగలీల వరుసం ధ్వనియింపఁ జలించె నేగగన్

దేవమనోగతమ్ము యువతీ పరిచారిక లంతఁ గాంచి, యెం
తే వినయమ్మునం బశిరహిం బ్రియయంద నమస్కరించి, యా
జ్ఞావశలై రి పీఁడియ బుజమ్మునఁ గై కొని దించి, రాజ యా
నావసరమ్ములం దమ భుజాగ్రములం గయిదండ లిచ్చుచున్

ఇరువురు రామ లల్లన వహింపగ నా నృపుఁడేగి నృత్యమం
దిరమున హైమవేది రమణీవ్రజముం దమ చామర ప్రభాం
కుర తరళ శ్రవోమణి వికుంచిత వీక్షల వీవ, లాసికాం
తరములకుం బ్రమోదకలనమ్మున నందె నరేంద్రపీఠికన్

నరపతిఁ గాంచి యందఱు వినమ్రముఖమ్ముల లేచి, యాసనాం
తరముల తేవి వెన్కఁ బ్రమదమ్మున నల్లనఁ గూరుచుండ వె
ల్లరు వరలాస్యయోషలు చలల్లలితస్వన హైమకంకణాం
కురిత కరమ్ములం బ్రభునకుం జయవెట్టిరి హారతిచ్చుచున్

అమరుక దేవదివ్య భవనాంతరసీమ విచిత్రశిల్ప భం
గిమఁ గమనీయ నర్తన నికేతనమందు మృదంగ వాదనా
ధిమిధిమి ఘోష విశ్చలిత దీపికలం గదలింప లాసికా
రమణుల పాద నూపుర విలాసము లల్లన ఘల్లుఘల్లనెన్

కర్పూరదీపికా కాంతి జాలికలందుఁ
గర్ణభూషణ చటకమ్ము లెగుర
చేలాంత సంచల చ్చిత్రవర్ణములందు
బర్హిబర్హములు విభ్రమము మెరయ
లలిత కంకణ తాళ కల నిస్వనములందు
చిఱుమట్టియలు మనోహరత మ్రోయ
సవిలాస సంభ్రమ చంక్రమణములందు
మేల్ముసుంగులు జారి మెరపు లెగయ

గళిత వనపర్ణముల గలగల రవముల
హైమమందానిలములె దిగంతరముల
గిరగిరని వెన్నెలల వడి దిరిగినటుల
వనిత లాడిరి చంచలా వర్తగతుల!

కలకలలాడు వీణియలఁ గాంచన కంకణ సుందరద్యుతుల్
దళతళలాడి మీటు వనితల్ మెలమెల్లన నిర్నిమేషలై,
కలల మునింగిరో యనగఁ గన్నుగవల్ ముకుళింప, వారకాం
తలు సవిలాస లాస్యములఁ దన్మయతం భ్రమియించిరాసభన్

అం దలకాంతరాళ చలహార మనోహరఫాల, కేతకీ
కుంద సుమావళీ రచిత కోమలకైశిక, అప్సరోంగనా
వందన తోరణార్హ మృదుపాద విలాసయుఁ గింశుక ప్రభా
ఘుందర నామధేయ ఒక సుందరి మంద పదారవిందయై

అల్లనఁ బారిజాత కుసుమాంజలిఁ బూవలవోలెఁ జల్లి, వి
ద్యుల్లతికా సుమమ్ముల విధూతము లయ్యెనొ నాగ, లాస్యరా
జల్లలనా మయూరికల చంచల భూషలకాంతి వర్షపుం
జల్లులు రాల నృత్యమయ జాలమొనర్చె సఖీసహాయయై

పడి బుసకొట్టు గోధుమల వన్నియ నాగుల ముద్దులొల్కు లేఁ
బడగలవోలె నృత్య పరివర్తిత హస్తములాడ, హారముల్
దడబడ నా విలాసవతి దానవవైరి దశావతారముల్
గడు నెఱజాణయై నెరపెఁ గన్గవ మోడ్పు సభాంతరమ్మునన్

కామినీ వలయ రేఖాపరివేష యై
లోల గోపీ రాస ఖేలనమ్ము,
మ్లానమల్లీ మాల్య దీన తన్వంగి యై
రాధికా విరహ దుర్భర భరమ్ము,
దురవేక్ష్య ముఖ సముద్ఘాత శోణాభ యై
నటరాజ విలయోగ్ర నర్తనమ్ము
లులిత బాష్పాంతయై లోచన ప్రాణయై
ముగ్ధసత్యాంగనా మోహవిధము

బహువిధమ్ముల నటియించి పాదవిగళ
దరుణనఖరేఖ, మంజీరఝరిత శోభ
గలిసి యాప్రాంగణమున మ్రుగ్గులు రచింపఁ
దరుణి నిల్చెను నర్తనోత్సవ మొనర్చి।

ఒక కమనీయలాస్య గగనోపరిభాగము నంది, యంతలో
నొకనిమిషమ్ములోఁ బడియెనో ధరణీతలకూపమందె నా
సకలసదస్యలోక మొకసారిగఁ గన్నులు విచ్చి చూచె నా
వికసిత కేతకీ తరళ వీక్షణ దీపికఁ గింశుక ప్రభన్

ఆ నాట్యాంతిమవేళ వేణుకల గానానంద నిద్రాలస
శ్రీనాగేంద్ర మనోజ్ఞమూర్తి, రమణీ స్విన్నాంగు శీషచ్చల
న్నానా చామర లాలితామరుక ఘూనాధుంకు మాలోత్పలా
లీ నాళల్ రవళింప రెప్పల గదల్చెన్ దీర్ఘనిశ్వాసియై

సుడివడిపోవు నేతరళసుందరతార్ణవ పూరమందునో
బడి వడిఁ దేలుచుం గలల వాలిన తన్నయనమ్ములంచులన్
విడివడి సుప్తిపీఠికల వీడని వైస్మృతు లేవొ పిల్వగన్
బడలిన దృష్టి గాంచు నవిభావ్య మహోమయ దివ్యలోకముల్

హారతులై మహోజ్జ్వల మహస్సులు నంత వెలింగి యారు మం
దార సుమారుణ మ్మయిన తన్నయనాంచల రాగరేఖయం
దా రమణీయ లాసికల హారములం జ్వలియించు దీపికా
తోరణ శోభలుం గనులఁ దోచెఁ గ్రమక్రమ దృశ్యమూర్తులై।

తెలతెలవారు వేకువలఁ దీయని యెల్గులఁ జివ్వి మొల్కలుం
బలవలు దేల నల్గడలఁ బల్కు విహంగములై, తదింద్రియ
మ్ములు తమగూళులన్ వెడలి మోడుపు రెక్కల నార్ప జామ్మునం
దలపులు రేగి యాడఁ బ్రమదల్ విలసిల్లి రుషోవిలాసలై

ఆ రమణీమణీ ప్రభల నల్లన సోలి, మునింగి తేలుచుం
దారుమరాళలీల వికసన్నయనమ్ముల మేలుకాంచి. లా
క్షారుణిమల్ వెలార్చు చరణాలస మందగతిన్ సమీపకాం
తా రుచిరాంసముల్ గొని యతం డరిగెన్ దన హర్మ్యమౌళికిన్

అమరుక నర్తనశాలా
రమణులు తమ మందిరాంతరమ్ములఁ జేరం
దమతమ చాయలె చెలులై
యమరగఁ జని రంత నర్తనాలస గతులై !

అతనితో వినిర్మల నఖావళిలో జ్వలియించు కప్రపుం
జ్యోతి వహించి, చెక్కిళుల సుందర ధూమ వినీల వల్లికా
వ్రాతము లల్లిబిల్లిగొన వాల్గనులం జనెఁ గింశుకప్రభా
శ్రీతరళాస్య మెల్లన విశీర్ణతమమ్ము దొలంగ దూరమై !

దూరమునం ధ్వనించె నవతోయద మంథర నాదమై, నగా
రా రమణీయహర్మ్య శిఖరమ్మున నర్ధనిశీథవేళ; నా
తార నినాదముల్ శ్రుతులఁ దాకిన ముగ్ధమయూరి దీర్ఘకే
కారవముం బొనర్చె తదుపాంతవనాంతము మారుమ్రోగగన్

ఎడనెడ నుత్తమాశ్వముల హేష, తురంగమశాల మ్రోయు సం
దడులఁ జెలంగి యెల్లెడల దవ్వులకేగెఁ; గపోతమాల లా
సదులకుఁ బల్లటీ ల్గొనగ సాగెను; సౌధకులాయపాళి న
ల్గడలఁ దదీయపక్ష యుగళమ్ములఁ జప్పటు లుప్పతిల్లగన్

మావుల నీలి పర్ణముల మంద సమీరములన్ మిణుంగురున్
బూవులు విస్ఫులింగముల వోలిక రజి వెలింగెఁ; బద్మ ప
ర్ణావళి నిద్రవోవు మిహికార్ద్రి బలాకల రెక్కలార్చు నా
రావములం గలంగిన సరస్సలిలమ్ముల నూగెఁ దారకల్

నీల వనాంతరమ్ముల వినిర్గత శోభలఁ దోచెఁ జంద్రరే
ఖాలవ సూచికా రుచి వికాసిత నీడము; సాంద్రశాఖికా
జాలమునం బతంగ దర చాలిత పక్ష సమీరణమ్ములం
గూలె సువర్ణపర్ణములు కోమల పాత మనోహర ధ్వనిన్

తెలితెలి గ్రుడ్డివెన్నెలలఁ దేలు వటాంచల నీలపర్ణ చం
చల వలయమ్ము లుల్లసిలె శాంతదినాంతర దీర్ఘికోదక
మ్ములఁ జలకూర్మమాలికలఁ బోలి. దివమ్మున వ్రేలుకృత్తికో
జ్జ్వల కలధౌత హారమున జారెను దారకయుం దటాలునన్

తీవల నీడలం గలకదేరిన వెన్నెల చిప్ని జాలు నె
త్తావులు జిమ్ము పచ్చికల దారులఁ బ్రాకఁదొడంగె; మల్లెలం
బూవులు రాల్చి సొమ్మసిలిపోయిన తెమ్మెర పారిజాతపుం
ద్రోవలఁ గన్నుమూతవడి దూపెను రాలిన పూలసెజ్జపై

క్రమముగ నా తమస్విని సుకుమారపు నిద్దురఁదూలి, మందమం
దములగు జృంభణమ్ముల విధమ్మునఁ దెమ్మెరలూర్పునంత నా
యమరుక రాజహర్మ్య శయనాలయసీమఁ గపోతకంఠ నా
ద మిళితమై ధ్వనించెఁ బ్రమదామృదుభాషణ మివ్విధమ్మునన్

తమి విగి కౌగిలింతల వృథా సడలించి, లతాంత లోలుప
భ్రమర కుమారలీల మధుపానమదమ్మునఁ జొక్కి, ముగ్ధ మీ
రమణి హృదంతరమ్ము విధుర మ్మొనరించితి రంతెగాని ఓ
యమరుకనాథ! తా మెరుగరైతిరి ప్రేమ గభీర వేదనల్

తీరని కాంక్ష వార యువతీ మృదులాధర నవ్యనవ్యమం
దార మధూళికై బహువిధమ్ములఁ బర్విడు మీ హృదంతర
ద్వారమునందె నిల్చి వసివాడిన దీ ప్రణయార్ద్ర దీనక
హ్లారము దీని కెన్నటికి నైన నిరాదరమేకదా! ప్రభూ!

మీ కమలాంక శయ్య దర మీలిత లోచననై ప్రవాణ పీ
ణాకృతిఁ బవ్వళించి, మధురానుభవమ్మున మున్గునంతఁ దా
మే కరుణా విహీనత వహించి ననుం దిగనాడిపోయి నా
రే! కలదో! సుఖస్మృతి విహీనకు నేయెడ నింత పీడయున్

ఏటికో! నామనమ్మున నొకేగతి ఘోషలువెట్టు నేడు నా
నాటి మధుప్రభాతకృత నాట్యకళావ్యసనమ్ములెల్ల ము
న్నీటి మహాప్రవహిం బతి మునింగి నశించువిధానఁ గాని యే
నాటికి నైన మీకు వశునమ్మున నిల్చెనె బాష్పలేశమున్

ఊరకె నేనుమాత్ర మెపుడో హృదయమ్మికఁ బ్రేమ సుందరా
కా రథరూఢమై సుఖవశమ్మున నిద్దుర మున్గిపోవు; రా
నేరవి యా మహోత్సవమె నేడిదె నాకయివచ్చెనంచు నీ
తీరున నే యి కెన్నటికిఁ దీరవి యాశలకై కృశించెదన్

మీ హృదయమ్ములో నొక నిమేష తళ త్తళదాళ నూత్నకాం
క్షాహుతియై గతించినది యా ప్రణయాంకుర ముగ్ధగాథ; బా
ధాహత జీవితమ్మునకు నై యట శాంతి యొకింత లేక, నే
నో హృదగాథవేదనల నూరక యీ గతిఁ ద్రవ్విపోయెదున్

నాటి మనోజ్ఞకాంక్షితము నాకయి రాదుగదా! మరింక మి
మ్మేటికి మాటిమాటి కిటు లింతలు గాథలు త్రవ్వి యూర కా
రాటము సేయుదాన; మదిరా పరతం దమనేత్రపాళి యా
పాటలశోభ నే స్మరణభారములో దిగఁబారునోకదా!

వేళ యతిక్రమించెఁ బృథివీ పరమేశ్వర! రేయి నిద్రకుం
దాళని మీకనుంగవ మదమ్మునఁ దూలెను బక్కెళయ్యు న
ర్ధాలసమై మరేమి తమకై వచియించెదఁ బోవుదాన శ
య్యాలయమం దనంత విరహానుభవమ్మునఁ దేలిపోవగన్

అని వచియించు నామె ప్రణయస్మరణమ్మున నంతరాత్మలో
ననుభవ మంథరస్మృతు లనంతము లున్మథితమ్ములై కలం
చిన, వతిదీర్ఘ నిశ్వసన చింతన శాంతత, నా నరేశ్వరుం
డవిమొను కింశుక ప్రభకు నర్ధశయాన మనోజ్ఞమూర్తియై

ఏమని నే వచింతునో సఖీ ! హృదయాంతర తీవ్రదాహ బా
ధామయ జీవితమ్మిది నితాంత మెటో! అవిభావ్య చారుతా
శ్రీమహనీయలాస్య వివశీకృతమై పరువెత్తిపోవు వి
శ్రామ మొకింతలేని సవిషాద మనోరథ శూన్యవీథులన్

ఇది కలయై, యొకింత వచియింపగరాని మహేంద్రజాలమై
హృదయమునం దొకేవిధి రచించు నపూర్వము విభ్రమమ్ము; నే
నిది యది యంచు దీని వచియింపగనేరక, రమ్యతా రసో
న్మదితమతిన్ నిరంతరము మత్తిలెదన్ బహుభోగలాలసన్

నీ వలనాటిరేయి, రమణీ ! మృదుగాన విచిత్రలీల, నా
జీవనమెల్లఁ బూల వికసింపగఁ జేయగ నంతలోన, నా
లో వినిచెం గభీరముగ లోల విపంచిక నంతరాంతరా
త్మావరణమ్ములో నెవో నిరంతర మోహనరాగ కీలలన్

నీవపు డప్సరో విరహిణీగతి, నిశ్చల హైమవల్లకీ
శ్రీవిచలన్నఖాంగుళుల జీవనమో ! మృతియో మదమ్మొ, యే
మో వివరింపనీయని యెదో ఒక నిర్వృతి వింపినంత, నా
లో వనితా ! ధ్వనించె నెదలో నెవో పిల్పులు మంద్రమంద్రతన్

నీ మృదు వల్లకీ నినద నిర్గత మా కమనీయ రాగిణీ
కోమల పాదలాస్య మవగుంఠన భాస్వర హీర నూపుర
శ్రీ మహనీయమై యెద సృజించిన దృశ్యము లెల్లవేళలం
భామిని ! కన్నుదోయి నెదబాయవివై మెరసెం దదాదిగన్

నీ వపు దంత నన్ను గరుణించితి రాగభరావ నమ్ర పీ
ఠావిధులం దరస్మిత వికస్వర కింశుక మంజులాథ రా
శావహ భాషణమ్ముల నిరంతర దోరుపగూహనమ్ములం
జీవన మంతనంత వివశీకృత చేతనమై సుఖింపగన్

మన మపుడా శరన్నిశల మందగళన్నవ పారిజాత మో
హన పవన ప్రచారముల నా పొదరిండ్ల సుఖాసనమ్ము యౌ
వన మధుపాత్ర నావి నిలువన్ నవశోభ ననంతసృష్టి ని
ల్చిన దనిమేషదృష్టి సఫలీకృతచేతనమై ముదమ్మునన్

నీ ప్రణయమ్ములో నపుడనేక యుగాంతర విస్మృతమ్ము ది
వ్యప్రభలన్ మనోహర మనంతము నిర్వృతి లోకమేదొ, నా
దే ప్రథమమ్ముగా నవతరించిన నా సుఖజీవితమ్ము, జా
లై ప్రభవించె బాష్పమయమై మధురస్మృతులం గరంగుచున్

నా కెదొ ! దూరవేణుకలనాదము విస్మృతపూర్వ మన్మనో
లోక సరిన్నికుంజములలో నుదయించిన దానిఁ బోలె, రా
గాకుల గద్గదస్వరయుమ్మగు తీయని పిల్పువోలె నె
న్నో కలచెం బురాస్మృతుల నూహల కందని యాత్మసీమలన్

రెపరెప లాడు నా బ్రదుకు రెక్కలతోఁ గనుఁదోయి మందమం
ద పతదనంత బాష్ప జల ధారలతో సవిషాదరేఖ నే
నపర సుఖ ప్రసంగముల నంటని మానసిక ప్రవృత్తితో
వపు దతి గాఢవేదనల నా ముకళీకృతినై తపించితిన్

అది లభియింపకే బ్రదు కహర్నిశముం దహియించె; నంత న
న్నెద విగతానురాగునిగ నెంచితివో! మరియేమొకాని, యో
హృదయవిదారిణీ! సఖి! గతించితి నం ద్యజియించి, హర్షనీ
రద వసనావగుంఠన తిరస్కృత చంచల పూర్ణిమాత్వరన్

హృదయాలభ్య మనోరథమ్మున కొకింతే నాశయే లేని నా
బ్రదుకా దుఃసహ విప్రయోగ విగళ త్ప్రాణమ్ములన్ సోలెనే
కద! లేశమ్ముఁ గవోష్ణ బాష్పమును నీకందోయి నిండారకే
యది నీ ప్రేమకథాంత మైనది షరేమందున్ సఖీ! దుర్విధిన్

ఓసకియా! నిరంతర వియోగ భరమ్మునఁ గ్రుంగి, దూరవం
శీ సవిషాద గాన వివశీకృతమై, అవిరామ బాష్ప ధా
రా సదృశాకృతిం గని, కరంగుచు దుర్భర జీవిత మ్మదే
మో సకలమ్ము నొక్కగతి నున్మదిత మ్మయిపోయెనేగదా!

అదిమొద లావిచార భరమందును వారవధూ శుచిస్మితా
స్పద మదిరా రసమ్ము మధుప స్వర మంథర రత్న వల్లకీ
మృదు కరుణార్ద్ర గానమును మేర యెరుఁగవి యేసుకమ్మొ నె
మ్మది విరియింపఁ దోచె నొక మానస శాంతి విచిత్ర రూపమై!

ఆ మోహావృత మైన భోగముల వాంఛాసక్తిలో నేలనో!
భామా! విస్మరియించితిన్ బ్రదుకులో భాగ్యాకర మ్మైన నీ
ప్రేమారాధనయున్ సుదూర మురళీరీతిన్ సమస్తమ్ము, నా
కేమో! విభ్రమరీతిఁ దోచు నిది యెంతే మానసోన్మాది యై!

మరువగ రాని నీ ప్రణయమాధురి. మానససీమ నేదియో,
చిరతర కాంక్షితమ్ముమ సృజించి కలంచిన దివ్యవేణు మం
థర సవిషాద గానము నితాంతము విస్మరియింప నేలనో!
తరుణి! యెరుంగఁజాలనుగదా! యిది యెంత తలంచి చూచినన్

నను గరుణింతువో సఖి! యనంతము నా యపరాధజాల మె
ల్లను భవదీయ మానస తలమ్మున విస్మరియించి, చిత్తవీ
ధిని జటులాంధకారముగతిం భయదమ్మగు జీవితమ్మునం
దనవరతమ్ము నీ ప్రణయ మారని హారతియై వెలుంగగన్

ఎవరుం జీవనమం దనారతములై యీరీతి నుత్పన్న ది
వ్యవిచారమ్ములఁ బాప నోపరుగదా! నీవైన నా దుర్దశా
ర్ణవ సంతారిణివై ద్రుతమ్ముగ నికన్ నా జీవ మార్గమ్ము జూ
పవయేనిం గలదో! మరింత సుక మీ ప్రాణమ్ములం దింతయున్

అని నిద్రాలసపక్ష్మలం దవశితమ్మై జారు కన్దోయి న
మ్మనుజేంద్రుం దవశాంగ భార వశతన్ మాద్యన్ మహానాగమూ
ర్తిని దోపించువిధమ్మునన్ నిదుర నందెం దీర్ఘనిశ్శ్వాస సం
జనితారావము లంశుకాంచలమునం జాంచల్యముం జెందగన్

నీరవ మయ్యె నాతవి వినిశ్శ్వసనమ్మును మెల్లమెల్ల; ని
ద్రారమణీయ మీలిత మరాళము నేత్రయుగమ్ము దీపికాం
కూర దర ప్రభన్ ముకుళ కోకనదమ్ములరీతిఁ బొల్చె; శ
య్యా రచిత ప్రసూన తతులై మెరసెం దర చంద్రికాప్రభల్

ఆ శయ్యాలయమందుఁ గాంచనమయమ్మై వెల్గు నా ద్వారమం
దాశాలేశము లేమి నిశ్శ్వసన హీనాస్యాకృతిం జిత్రసం
కాశాకారతఁ గింశుక ప్రభ వెలుంగన్ శాంత నిద్రాణ భూ
మీశ మ్మయ్యది దేవశ మ్మనుచుఁ దోపించెం గళద్దీపికన్

అట లజ్జావనతాస్యయై నిలిచియే యా సుందరీహీర మం
తట బాష్పాకులితావలోకనములం దద్రాజరాజేశ్వరుం
బటు నిద్రా వినిమీలితానను దరభ్రాంతిన్ విలోకించి ముం
గట బాష్పాంబు నిపాత శబ్దము చెలంగన్ మెల్ల నిట్టూరిచెన్

ఆశ వినాశమై తన హృదంతర కోరకితానురాగ మా
కాశసుమాకృతిం దుది వికాసము నందిన మ్రోయరాని దుః
ఖాశయ భార శీర్ణ హృదయమ్ము తనంతన వ్రీలుచుండ నె
ట్లో శయనాలయమ్మునకు నూర్చుచుఁ బోయెఁ జలల్లతాకృతిన్

మెల్లన ఖండఖండ సిత మేదుర వారిద రాజి, కాంతి సం
ఫుల్ల శశాంక రేఖఁ బరిపూర్ణముగా గ్రసియించి వీడినన్
నల్లని నీడ లా యుపవనమ్మున నెల్లెడ సాగరోర్మికా
సల్లలితమ్ములై నలుదెసల్ గలయం బరువెత్తె నంతటన్

ఆ సలిలోర్మికాకృతుల నందిన చాయల నామె, దీనహం
సీ సదృశాకృతిం జనుచు జిత్తమునం జనియించు తీవ్రబా
ధాసహజీవితమ్ము నిమిషాంతరముం భరియింపఁ జాల కా
యాసభరాతిరేకమున నయ్యెడ మూర్ఛిలునో యనం జనెన్

గూడులు గూడులై చెదరి కూర్మ శతమ్ముల రీతిఁ బ్రాకుచుం
గూడిన వారివాహ నివహమ్ములకున్ మరుగయ్యె శశాంకరేఖ; యే
జాడలఁ జూచినం బ్రకృతి శాంతముగం గను మూయ, నెల్లెడ
నీడలు వెల్గు లొక్కసరణిం గనిపించెను గ్రుడ్డివెన్నెలన్

మ్లాన శశాంక రేఖపయి మంథర వారిధ రావగుంఠన
మ్మానిన, నీలకుంతలములం దరలన్ జిఱుతారకల్ విష
ణ్ణాననయై, విశీర్ణ శిఖయై రజనీసఖి కింశుకప్రభా
దీన మనోరథ మ్మది విదీర్ణ హృదంతరయై తలంచెనో !

# ద్వితీయాశ్వాసము

ఓయి ! సఖా ! మధువ్రత ! మధూత్సవ లోలత నెంత కాల మై
పోయెగదోయి ! నీవు కనుమూసి యిదేవిధిఁ బద్మపాత్రలం
దీయని తేనె లానుచు మదిం గణియింపవు గాక ! యింతలో
నే యిది విస్మరించిన మరేమని నీకయి విన్నవింతునో !

మరచితివో ! మనమ్మున నమంద సుమాసవ పాన మత్తతం
దర సురభీకృత మ్మయి వనమ్మునఁ బర్విడిపోవు నీవలిం
బరిచితమై వినఁబడిన ప్రాణహర ప్రణయప్రయాణ మం
థరరదమున్ మనమ్మున ముదమ్మున నెంచిన దూర యాత్రయున్

జలజల బాష్పముల్ కనుల జారుగదా ! హృదయ ప్రయాణముం
దలచిన యంత మాత్ర; నెదదన్ స్మృతినీరధి పొంగిపొర్లుచున్
జెలియలికట్ట యేదియొ విచిత్రవిధమ్ముగ మీరిపోయెడిన్
పలుకుల కేలఁ గాని, తలపం దలపం బ్రదుకే కరంగునో !

ఎన్నటి మాట నీ విది గణింపవుగాక ! మధువ్రతా ! వృథా
యెన్ని గతించెనోయి ! యిటులే దివసమ్ములు; నీధుకాంక్షతోఁ
గొన్ని దినమ్ము లుందు రనుకో ! భవదీయ విచిత్ర లాలసం
గన్నది లే దొహో ! యుగయుగమ్ముల నెన్నడుగాని యివ్విధిన్

తెలతెల వారి పోయె ! గుఱుతింపవుగాని, విభాత వాత గీ
త లవములో వినంబడెఁగదా ! బహుదూర నినాద మేదో ! కో
కిల కలకంఠ కూజిత మొగిం బిలుపై వినిపించురీతి, నీ
యలసత వీడి ర మ్మిక సఖా ! పద ! పోదము వాతపద్ధతిన్

ఇది మది నద్భుత మ్మగు సుమీ ! చెలికాడ ! భవాదృశుండు నె
మ్మది మదిరా పిపాస బహుమానము సేయుటె ! చేసినావు పో
యెద నిటు విస్మరింపఁ దగునే ! భవదీయ చిరప్రవాస; ము
న్మదిత మనస్కతం దినదినమ్ము గతించె యథాప్రకారమై !

తూరుపు తెల్లవారె ననఁ దోచెఁ గనుంగొను మెల్ల దిక్కులం
దోరములై ధ్వనించు మృదు తూర్యలవమ్ము లనంతవల్లకీ
తార విరావ సుందర విధమ్మున; నీ బహు భాగ్య సస్య మె
న్నో రతనాలు పండెనో ! మహోదయ మంగళ వాద్య ఘోషలన్

ర మ్ముదయారుణాంశు నికరమ్ము కరమ్ములఁ ద్రోసి పిల్చు తూ
ర్యమ్ము లెవో సఖా ! మన హృదంతర గమ్యపథమ్ము దోచు దూ
రమ్మునఁ జేయి సాచి యిటు రమ్మని పిల్చినరీతిఁ; బద్మత
ల్ప మ్మికనైన వీడి మధుపా ! స్మరియింపు భవచ్చరిత్రమున్

అని వినిపించె రాజ శయనాలయమం దొక దివ్య మాగధ
స్వన మతిదూర వాంశిక విషాదరవమ్ము విధమ్మునం బురా
తనభవ వల్లభా ప్రియ కథా స్మృతి వోలె నరేశ్వరాంతర
మ్మును గలఁగించుచున్ నిదురమ్రోగుచుఁ గన్నుగవం గదల్చుచున్

అల్లనఁ బాన్పు డిగ్గి, హృదయమ్ము తరంగిత గీతికా శ్రుతిం
జల్లు మనంగఁ గన్నుగవ జారెడు బాష్పములుం గపోల రా
గోల్లసితమ్ములై గళతలోపరి భాగమునందు, భూవిభుం
డుల్లమునం దలంచు విరహోచ్ఛ్వసితమ్ముల గీతికారుతిన్

ఇది యని తా నొకింత గురుతింపగ లే దవనీశ్వరుండు నె
మ్మది నదియించు గీత చరమ స్వర మంథరతం దలంప గ
ద్గదిక జనించుఁ గంఠమునఁ గన్గవఁ జారును బాష్పపూర ము
న్మదితములై భ్రమించు నొకమారుగఁ దత్సకలేంద్రియమ్ములన్

దినదిన మీవిధిన్ నృపహృదిన్ ధ్వనియించె విభాత గాన మో
హన నినదమ్ము రాజశయనాలయసీమ; దినత్రయమ్ము న
మ్మనుజ విభుండునుం గనఁ బ్రమత్తుని పోలిక ముగ్ధ శైశవ
మ్మునఁ దిరుగాడు బాలకుని వోలిక నుల్లసిలెం దివానిశల్

అమరుక చేవుఁ డం తహ రహమ్మును నివ్విధి గానవైఖరిం
దమకమునన్ నిరంతర మెదం బరికించియు, నిశ్చయింప నే
రమి, వికలాంతరమ్మునఁ జిరమ్ము కరంగుచుఁ గింశుకప్రభా
రమణి సమీప వర్తివికర మ్మవలంబము సేసి యి ట్లనెన్

కొన్ని దినమ్ము లాదిగ నగోచర కారణ మై, మనోజ్ఞ రీ
తి న్నదియించు వేకువ, నతి శ్రుతి మోహన మొక్క గీతి; యా
సన్న గృహాంగనా గళ రస ద్రవ గాన మెదో స్రవించె నం
చెన్నితి గావి గీత మెలయించె విచిత్రముగన్ మనోజ్ఞమై

మూడు దినమ్ము లాదిగఁ దమో నివహమ్ములు సంజ్వలింప, నా
మ్రేడిత రాగ రేఖల సమీర కుమార పరీమళమ్ములం
గూడి శ్రవోంతరాళములకుం బ్రమద మ్మొలయింప, నెవ్వరుం
బాడిన రీతి లేక, మధుప స్వర మోహన గీతి మ్రోగెడున్

ఆవిధి నర్ధరాత్ర సమయమ్ముల నా మృదు గీతికా శ్రుతిం
బావనమై హృదంతర మపార సుఖమ్మునఁ దేలఁ జిత్రభా
వావహ రీతులం గల లనంతములుం బరమాద్భుతమ్ము లే
వో వివిధమ్ములై, మెరసి యుజ్జ్వల దృశ్యములై వెలింగెడున్

విను మది కింశుకప్రభ ! దివిం ధ్వనియించు, సహస్రవాంశిక
స్వన మవిరామమై, యొక విషాద విదీర్ణ వియోగి కామినీ
తనుతర గీతికా స్వన విధమ్మయి, మేలుకొనంగఁ జేయు, నె
మ్మనమున నిద్రవోవు మద మంథర సంస్మృతి పన్నగమ్ములన్

నా యెదలోని సంస్మరణ నాగసహస్రము లెల్ల నొక్కమా
రాయత మూర్తులై, మెరపులై నటియింపుచుఁ నన్ను గాథని
ద్రాయుతబుద్ధి నున్మద పథమ్మునఁ గూల్చు; విచిత్ర; మింతలో
నే యిది యేమియో మరి ! యొకింత యెరుంగను గింశుకప్రభా !

నేటి నిశావసాన తపనీయ మనోహర వేళఁ దారకా
కోటి మనోజ్ఞ హర్మ్యతల కుట్టిమసీమ, శయించి, యీజగ
న్నాటక లోఁ దలంచిన మనమ్మున నించుక నిద్ర వోయినం
బాటిలు విభ్రమమ్మున విభాసిలె నొక్క విశేష మత్తరిన్

వింతలు వింతలై నిదుర వేళలఁ దేలుచుఁ జిత్రరీతి నా
స్వాంతము నొక్కమారు గత సంస్కృతులేవొ కలంచి పోవ నా
వంత సుషుప్తి లేశము మదంతరసీ మలఁ గ్రమ్మనీయక
త్యంత మనోహరమ్మగు మహాద్భుత మిక్కల దోచె వేకువన్

ఎదియొ మహేంద్ర నీల రమణీయ మచంచల మంధకార ధీ
ప్రదము మహార్ణవ మ్మది యపారము; ధీర సుషుప్తి మున్గి నె
మ్మది సుఖనిద్ర మున్గు నొక మంత్ర విముగ్ధ భుజంగలీల, న
య్యది వలయాకృతిన్ నిదుర నందె ననం గనుపించె శాంతమై

తారక లమ్మహాబ్ధి నవదాత వినిశ్చల భృంగరాజి రే
ఖా రమణీయ మూర్తుల సుఖమ్మున నిద్దుర వోవ, సాగరా
కారము శాంత నిస్వన వికస్వర నీల మహోత్పలాకృతిం
జారుతరేంద్రనీల విలస న్నవ దర్పణ మయ్యె నంతలో

ఆ జలధిన్ సువర్ణమయ హంసనిభ మ్మొక నావ, తామ్రనీ
రేజ దళ ప్రకల్పిత తరీవిభవమ్మునఁ దేలి, కాంతి నీ
రాజిత సాగర మ్మయి, వరప్రభలం జ్వలియించె నౌర్వ వి
భ్రాజిత రత్నవ న్మకుట భాస్వరయై జ్వలితోర్మిమాలయై

జ్వలదగ్ని ప్రతిమాన నౌక నవశస్వాంతమ్మునన్ బాటలో
త్పల శయ్యా రచితోపధానమున నంతం దిగ్భ్రమం జెంది, నే
నలువంక ల్పరికించునంత నిలిచెన్ నాముంగట న్మందచం
చల చేలాంచల దేవి యొర్తుక దిశా జాజ్వల్యమాన ప్రభన్

మకుట భాస్వర చిత్ర మాణిక్య దీప్తి, మ
హేంద్రకార్ముక మద్ది నింపు గొలుప
కర్ణావతంసిత కల్హార భృంగమ్ము
వల్లకీ మంద్ర నిస్వనము మ్రోయ,
మహితోజ్జ్వల ప్రభా బహు తరంగమ్ములం
దిందిరాదేవి జనించె ననగ
కరుణా కటాక్ష వీక్ష పయోజలధి యుం
దంతర మమృత గాహన మొనర్ప

ఎవ్వరో ! దివ్య లోక మహేంద్ర మకుట
రత్న చిత్రి ప్రభా సమారాధనీయ
పాద నఖరాజి యద్దేవి, భాసురప్ర
భం జ్వలించెను దృష్టిదేవళమునందు !

ఆ తరళప్రభాంధ తమసాహత పుల్ల విలోచనమ్ములం
గాతరమూర్తినై పదయుగమ్మున వ్రాలితి నంట; నంత సు
స్నాతము లయ్యె నంట నిమిషమ్మునఁ దచ్చరణమ్ము లస్మదీ
యాతత లోచనమ్ముల నిరంతరముం బ్రవహించు ధారలన్

అవిధి నెంతకాలము సమాహృత చేతన మానస స్థితిం
దేవి పద ప్రవాళ వితతిం దల వాల్చి, తదీయ దివ్య మో
దావహ శాంత వీక్షల నిరంతర తన్మయభావ మందినా
నో వచియింపఁజాల మది నూహ లొనర్చియుఁ గింశుకప్రభా !

అంత హృదంతరాన మధురామృత బిందు మనోజ్ఞ వర్ష వి
భ్రాంతి కరంగు లీల, నవ చంచల నిస్వన భూరి వల్లకీ
కాంత గభీర సుస్వర తుషారము జల్లులు రాలు లీల, గ
ర్ణాంతరవీధి మ్రోగెఁ జెలియా ! జననీ మృదు సూక్తి కింకిణుల్.

ఓయి కుమార ! లె మ్మదె ! మహోదయమై యరుణాంశువిద్రుమ
చ్ఛాయ, దిగంగనాలకలఁ జంచల కింశుక మాల యయ్యె; నో
హో ! యివి యేవొ ! దివ్య కిరణోర్మికలో ! దివిజేంద్ర చారు చా
పాయత రేఖలో ! బహు సహస్ర మయూర మనోజ్ఞ మూర్తులో !

ఆకాశమ్మున దేవదుందుభులు మ్రోయం బాదవిన్యాస మా
త్రాకారమ్ముల నేత్ర గోచర మహామైత్రి, యప్సరోనృత్య మో
హో కానంబడె వారిదావళులయం దూహింపు చిత్తమ్మునం
దీకాలమ్మున విద్రవోవ నుచితమ్మే ! రాజరాజేశ్వరా !

నీ వజరామరుండ వవనీశ్వర ! యోగవియోగ బంధ మో
క్షాపల మీ జగమ్ము భవదంతరమే సృజియించె; తారహా
రావళి నీగళమ్మున నిశాంతర భాస్వర తారకాళి, చి
త్రావహ కాల కందుక మహర్నిశ; లేగు భవత్పదాహతిన్ !

భాను సహస్ర మండల విభాస్వర మూర్తి ! అనంత విశ్వ వి
జ్ఞానమయ ప్రదీప ! వివశత్వమునం భ్రమియింప నేల ! నీ
వే నిఖిలమ్మునుం బ్రతిఫలించు వినిశ్చల సాగరమ్ము; నీ
వే నిరతమ్మునుం బ్రతినదింతు వఖండ సహస్ర ఘోషలన్!

నీ వొక దివ్య కల్పక వనీ మధులోలుప భృంగమూర్తి వీ
వే విరచించుకొంటి వవనీశ్వర భోగ మనేక-వార నా
రీ వర విద్రుమోష్ఠ మధురీకృత సీధు మనోహరమ్ము; నీ
వే వివిధప్రకార మిది యెల్ల హరింపగ నీశ్వరుండవున్ ।

ఎదలో సంస్మరియింపు మొక్కపరి నీవే దూర తారోన్నతా
స్పద వాస మ్మొనరించు భానుశత భాస్వ న్మూర్తివో । యేలఁ ద
త్పదవీత్యాగ మొనర్చి భోగమయ కాంతారమ్మునం దింద్రియో
న్మదితాధ్వమ్మున నేగెదో ! తరుణ భామా ప్రేమ లోలుండవై ।

ఇది చిత్రమ్ము సుమీ ! భవద్విరచిత మ్మీ నీ మనోదర్పణా
స్పదమౌ భోగ మహేంద్రజాల మవశ స్వాంతమ్మునం దద్భుత
ప్రదమై నేత్రములం జ్వలించునె ! మహారాజా ! ఒహో! లెమ్ము! లె
మ్మదిగో ! దూర మహః ప్రభాత ముదితమ్మై తోచెఁ బ్రాచీదిశన్!

అని వచియించి దేవి! హృదయమ్మునఁ జల్లని పల్లవాంగుళీ
గణ మృదులాగ్రపాళుల సుకమ్మున సోకినలీల నాశిర
మ్మునఁ దన పాణికింశుక మపూర్వ దయాప్రసరమ్ము దోప, మె
ల్లన నువిచెం దటాలునఁ దళత్తళ శోభ వెలింగె విశ్వమున్

అంత మహాద్భుతమ్మున హృదంతర మెల్లి వెలింగిపోవ, వి
భ్రాంతిభరాతిరేక వివశమ్మయి దేహ మొకింత సోల, నే
నంత గనుంగవం దెరచినంత విచిత్రము ! రోచిరుజ్జ్వలా
కాంత మహీధర ప్రకర యై చనె దేవి యదృశ్యరేఖలన్

ఈవిధి జిత్రరీతిఁ దిలకించిన యీ మహనీయ దృశ్య మే
మో వివరింపలేము కరుణోర్మికలం దెలిమీలలీల శో
భావృత లోచనమ్ముల విభాసిలు దేవి, నిరంత మన్మనో
భావనలం జ్వలించును విభాస్వర శోభల గింశుకప్రభా!

అన విని కింశుకప్రభ "మహాప్రభు! మీ కథనమ్ము మానస
మ్మునఁ గడు వింత గొల్పెడి నపూర్వ విధమ్మునఁ గాని, స్వప్నవ
ర్ణనమున భావిభాగ్యము దినమ్ము దినమ్మను వృద్ధి నొందు నిం
కని తలపింప జేయు హృదయ మ్మని మెల్లన నాగి, యిట్లనెన్

మీ వచనమ్ములం గల యమేయ శుభప్రదమై, అనంత మో
దావహమై, ఫలించు ననయ మ్మని భాసిలు; లోక మాతృదే
వీ వర దర్శనమ్ము, పదవీక్షణ, భాషణ లాభ జాల మెం
దే విఫలమ్ములై చనియెనే యెపుడుం గనినంతలో ప్రభూ!

తమ కిది విన్నవింప నెడదం దల పూనియు విస్మృతి ప్రమా
దమున కొకింత లోగిన కతమ్మున నియ్యది విన్నపమ్ము సే
యమి నెద గుందెదం గత నిశాంతర వేళల దాము విన్న గీ
త మధుర నాద మంథర విధ మ్మది యెల్లరకున్ వినంబడెన్

అంతిపురమ్మునందలి గృహాంతర వేదిక రత్నవల్లకీ
శాంత నినాద తంత్రికలఁ జంచల సుస్వర జాలమై తటా
కాంతర విశ్వలోదకములం దరవింద మిళింద నాద రూ
పాంతరమై ధ్వనించె ననయ మ్మొక గీతిక రాత్రివేళలన్

తాము వచించు గీతము విధమ్మనసే భ్రమరమ్ముఁ బిల్చి నా
నా మృదు రీతులం దది వినం బడు నెల్లర; క మ్మనోజ్ఞ గా
నామృత ధార పూరితములై లవలీలతలే హిమాంబుధా
రా మిళితార్ద్రగేయ మకరందములం గురియించు నెల్లెడన్

ఆవిధి గానమం దహరహమ్ము మహాసచివ ప్రధాన పౌ
రావళి యెల్లరుం దనిసి రైనఁ దమంత నిరంతరమ్ము నా
నావిధులం దలంచియు, మనమ్ముల నించుక నిశ్చయింపలే
కే విఫలోద్యమమ్ముల నొకేగతి విస్మయ మందుచుందురున్

తుదకు మహాప్రధాను లతిదూర వితర్కములం గలంగి తా
మెదఁ బరమోత్సుకత్వము వహించిన రీతియు లో నెరింగి భీ
ప్రద మతిమోహన మ్మసులభ ప్రభవమ్ము విచిత్రగాన మే
యదియొ మహాద్భుత మ్మని సహస్రవిధమ్ముల నెంతు రాత్మలో

ఇటుఁ దలపోతలం దుది నొకింతయు నిశ్చయముం గనంగ లే
కటవిఁ బరిభ్రమించు హృదయమ్మున నుండ నమాత్య సన్నిధిం
బటు రయవ త్తురంగము జవమ్మున డిగ్గిన గూఢచారు డం
తట నొక చిత్రగాథఁ బ్రమదమ్మునఁ జెప్పె నటం చెరింగితిన్

నగర సమీప కింశుకవనమ్మున నొక్క నగేంద్రకందరం
బగరుపరీమళమ్ముల నిరంతర ధూమము లాశ్రయింప ము
జ్జగములఁ గాంతిరాశి వివశ మ్మొనరింపగ నోపు శిష్యమ
ధ్యగత యతీంద్రమూర్తి గనవయ్యె నచంచల యోగ నిష్ఠమై

నీరవ దుగ్ధసాగర వివిద్రిత పూర్ణశశాంక సౌమ్య తే
జో రుచి నానన మ్మొలుకు శోభలఁ జంచల ధూమ వల్లికా
వారము లుల్లసిల్ల సుమవల్లరిపైఁ బవళించి, యోగ ని
ద్రా రమణీయ రీతి నిరతమ్ముఁ గనంబడు నయ్యతీంద్రుడున్

కాషాయాంబరధారు లుజ్జ్వల జటా కాంతిం బ్రవాళోల్లస
ద్వేషస్ఫూర్తి వెలుంగు నమ్ర వదనాంతేవాసులుం గొంద ఱు
ద్ఘోషమ్మై గళనాద మెల్లడలఁ జేతోమోదముం గూర్ప ని
ర్ఘోషోక్తి క్రమత న్నుతించెదరు దారున్ దన్మునీంద్రున్ బ్రభూ!

ఆతని కర్ధరాత్రుల నహర్ముఖవేళల వల్లకీశతా
ఘాత చలారుణాంగుళి నఖమ్ముల వెల్గులు నృత్యమాడ సం
గీత విమిశ్ర సామము లొగిం బఠియింతురు దీపకాంతి సం
పాత లస ద్గుహాంతర విభాస్వరు ల య్యతిశిష్యు లందఱున్

వారి సముద్రఘోషణ రవప్రతిమాన గళస్వనమ్ము వీ
ణారవమిశ్రమై బహుదిగంతములం జను రేల; భృంగగీ
తీరుతిరూపమై తమ కతిప్రియమై మనముం గలంచు నే
దో రుచిర స్వన మ్మతి దురూహ్యము గాన మదే యగుం బ్రభూ!

ఇంకను గొంద రెవ్వరో యతీశ్వర శిష్యగణమ్ము రేల వం
శాంకిత హస్తులై ప్రభుగృహాంతిక మారుతమం దనేక రా
గాంకుర సుస్వరమ్ము లొలయం దమకై విభాత బో
ధాంక మిళింద గేయ విచయమ్ములఁ బాడుదు రం చెరింగితిన్

వారల నందఱం బ్రభుసభాభవనమ్మునఁ దోడితేర ధా
త్రీరమణా! జవమ్మున సుదేవ మహాసచివుం డనంతర
మ్మే రయవ త్తురంగముల నెక్కిన మంత్రుల రాజగౌరవా
చార పురస్సరంబుగ వెసం జని రం డని పంచె సత్వరన్

వారలు వచ్చినంత సచివ ప్రియ బంధులఁ గూడి డెంద మిం
పార యతీంద్ర శిష్య నిచయమ్ము గనం గథ విన్నవింప ను
న్నారలు మంత్రిస త్తము లనంగ నొకింత యెఱింగి యుండి నే
నే రమణీస్వభావవశనై తమకై యిది విన్నవించితిన్

చారముఖమ్మునం బహువిచార మొనర్చి యమాత్యు లింత గ
న్నార సమ స్తముం గని రయమ్ముగ నిశ్చయ మందుదాక మీ
కై రుచియింపదో యను భయమ్మున నింతయు విన్నవింప కు
న్నా రని యెంతు నెవ్విధి గనం బరహేతువు లే దొకింతయున్

ఆదరబుద్ధి నెంతయు రహస్యము సు మ్మని యాన తిచ్చి నా
కై దయఁ గొంతఁ గొంత సచివాగ్రణి దెల్పిన వృ త్త మెల్ల దే
వాదరణమ్మునం జనవు నందితి నంచు వచించె దాసి దే
వా! దయతో క్షమింపు డని యామె వచించె వినమ్రనేత్రయై!

ఈవిధిఁ గింశుకప్రభ వచించిన వృ త్త మొకింత రాజక
ర్ణావరణమ్ముఁ జొచ్చిన యనంతరమే ప్రభునేత్రపాళి నే
వో వెలిగె న్మెఱుంగులు మహోజ్జ్వలకాంతుల నొక్కమారు ; లో
లో వివిధమ్ము లే పిలుపులో స్వనియించె సముద్రఘోషలన్

అమరుక దేవ నీల నయనాంతర బింబితమై సమస్త వి
శ్వ మహిత వస్తుజాలము. వెసం జ్వలియించుచుఁ గాంతిపుంజరూ
పము ధరియించి భాసిలెఁ; దివమ్మునఁ దారకలే జ్వలించి, యు
న్నమిత నృపాల ఫాల నయనమ్ముల హారతు లయ్యె నంతలోఁ.

ఆతని దృష్టిపాళికి సమస్తము కాంతిమయైక సాగర
మ్మై తనపైఁ దరంగ నిచయమ్ములఁ గ్రమ్మినరీతిఁ దోచెఁ; దా
నే తుది విశ్వరూపత వహించి యొకండయి నిల్చె సర్వభా
వాతిగభీర నిర్వృతి మయమ్మయి వెల్గె హృదంతరాళమే!

ఆవిధి నిల్చి యశ్రునివహమ్ములు గగ్గవ జాలువార జిం
తావిల మానసమ్మున నిరంతర సుందర దృశ్య రూప మే
దో వివిధారుణద్యుతుల నుద్భవ మందిన సవ్యపాణిభా
గావృత గండ కుండల విభాంచిత వీక్షల నిల్చె నాతఁడున్

అమరుక పాదసన్నిధి నిరంతర నద్ధ మనోజ్ఞ సూర్యకాం
తమణి విశేష నిర్మల పథమ్మున నంత వినమ్ర లాసికా
రమణి యొకర్తు మౌళిమణిరంజిత కుట్టిమయై ప్రమోదభా
వమున ధరేశ్వరుం బ్రకట వాగ్రచనమ్మున బల్కె నివ్విధిన్

అవధారు ప్రభుశేఖరా! ధరణినాధా నమ్ర మౌళి ప్రస
న్నవ మందార మరంద రంజిత పదా! నానావిధానంద భో
గ విశేషానుపమేయ వైభవ మహా గాంధర్వ విద్యా నిరం
త వినోద ప్రతినంది తామరుకనాథా! రాజరాజేశ్వరా!

తమ కరుణారవింద లలిత మ్మగు నంజలిబంధ ము త్తమాం
గమున వినమ్ర భావ గమకమ్ముగఁ బూని, సుదేవమంత్రిస
త్తము లిది విన్నవించిన కతమ్మున నో ప్రభువర్య! దేవ చి
త్తమునకు బాదదాసి విదిత మ్మొనరించు నమాత్యవాగ్విధిన్

బహుళోంకార విరావ మంత్ర పఠన ప్రారంభ గంభీర మ
మ్మహితాంసార్పిత వల్లకీధ్వని సభామధ్యన్ మహా హైమ స
న్నిహిత స్తంభములం ధ్వనింప నతవేణీబద్ధ శీర్షమ్ములన్
బహుమౌనీశ్వరు లెవ్వరో! ప్రభు గనం బ్రార్థించి రంగీకృతిన్

వారలవై ఖరిం గన సభాభవనమ్మున దేవసన్నిధిం
జారు విపంచికా స్వన రసమ్ము నఖమ్ముల నల్ల నోడ్చి రా
గారుణసీధు వెల్ల దమ కర్ణ్వణసేయఁగ నున్నరీతి నే
దో రమణీయగాథ నయనోల్లసిత మ్మగురీతి దోచెడున్

ఆ లలితోజ్జ్వలాంగుల మహర్షుల నందఱఁ జిత్రవర్ణ శా
ర్దూల తను ప్రకల్పిత విధుప్రియ రత్న మయాసనమ్ములం
జాలిత చామరాదిక సుసజ్జిత పూజల నందఁజేసి, రా
జాలయమౌళి దమ్ముఁ గన నాసచివాగ్రణి యంపె నం ద్వరన్

ఈ వృత్తాంత మొకింతయు న్నగరమం దేదో విధిం బ్రాకె నే
మో వేగమ్మునఁ బౌర రాజకుల బంధూదంచితమ్మై సుశో
భావేశమ్మున బూర్ణరాజసభ మీకై వేచియుండెం గృపా
భావ మ్మంది మహాప్రణామమితి సంభావింప రమ్మో! ప్రభూః

అని దౌవారికి విన్నవించినఁ దదీయాపూర్వ వార్తాంత మం
దనియెం గించి దుదంత నేత్రయుగయై యా సార్వభౌమార్పితా
ననయై మెల్లనఁ గింశుకప్రభ "ఒహో! నా విన్నప మ్మింతలో
నన సంపూర్ణవినిశ్చిత మ్మయిన ధన్యు న్నేనికం భూవరా!

మన మిదియే పథమ్మున నమాత్యవచోగతి నమ్మహాసభా
జన హృదయప్రియమ్ముగ వెసం జని దేవరకొల్వునం దపో
ధన గళ గీత సామము లెదం దనియింపగ వీనులారఁ గ్రో
లిన పరిపూర్ణసౌఖ్య మవలీలఁ గనం గరుణింపుడో ప్రభూ!

ఆ రమణీద్వయీ గళరవాంతమున న్నరదేవ సీధు రా
గారుణ లోచనమ్ముల నిరంతర బాష్పగతిం గవోష్ణవాః
పూరము జాలువార నెదఁ బోరని మ్రోతలు వెట్టి తేని నె
వ్వారలొ నిద్ర మేలుకొలుపం గను విచ్చినరీతిఁ గన్పడెన్

అతని హృదంతరమ్మున మహారవ నిశ్శ్వస దర్దురోర్మి ఘో
షిత వినద మ్మదేదొ! వివశీకృత కర్ణ మృదంగపాళులన్
బ్రతిరవముల్ సృజింప నెద పై పయి నిల్చిన బ్రహ్మరంధ్ర మోం
కృతి యొనరించె నొత్తి పలికించిన జంగమ శంఖముం బలెన్

దూరమునం బ్రభంజన విధూత వలాహక ఘోషణమ్ములం
దారరుతమ్మున న్నిరత ధారల వర్షవినాదరీతి నే
దో రవ మన్నరేశ్వరున కోయని పీనులఁ దోచి కాంతిధా
రా రుచిరమ్ములై మెరపు లంతఁ దళుక్కువియెం గనుంగవన్

ఆ నరదేవలోచనము లర్ధనిమీలన మంది మందమం
దానిల చాలితారుణ సుహాస వికస్వర చంద్రకాంత శో
భా విలయమ్ము లయ్యె నరపాలకులాగ్రణి శూన్యదృక్కులం
దానతి వారుణీరస మదమ్మునఁ దూలుగతిం గనంబడెన్

అది గమనించెనో యనఁ దనంతన చేరిన కింశుకప్రభం
గదిసి నరేంద్రు డంతట మొగమ్మునఁ సుస్మితశోభ నవ్వధూ
వదన మొకింత కన్గొని సభాభవనాంతర భాషణమ్ములుం
బదనిసదమ్ము మాత్ర నిలువం గొని యేగె వధూన్నతాంసమున్

షేనిసమీపమందు పచరించు వధూజన మంత నమ్మహీ
జానిపదమ్ము లాన విలసన్మణి కంబళ రాజ రాజమా
ర్గానుపదమ్మునం దతిరయమ్మునఁ గూర్చి మనోజ్ఞ కుందమా
లా నివహమ్ము కంబళములం దొనరించిరి పూలబాటగన్

ఆగమనాంతరాళ సమయమ్మున న న్నరదేవ దాస దా
సీగణ సంభ్రమార్పిత మశేష పరీమళ భార లోల కా
లాగరుధూమమాల లలనా చల చీర సమీరణోర్ముల
దూగె నరేంద్రమౌళి నసితోత్పల చంచల తోరణమ్ముగన్

అంత నరేంద్రుడుం దన సభాంతరముం గయిసేసె; సామి వి
శ్రాంతకరమ్ము నెచ్చెలిబుజమ్మున మెల్లనఁ జేర్చి మంత్రి సా
మంత నరేంద్ర మండలి సమస్త మనంతర మొక్కుమారు వి
భ్రాంత విలోచనమ్ముల సభాభవనమ్మున నిల్చె దిగ్గనన్

వారి కిరీట చిత్ర మణి వర్ణ వికస్వర పుష్ప మంజరీ
వారము లా సభం దరళ వాసవకార్ముక లోల సుందరా
కారతతుల్ సృజించి వెలుగం బృథివీపతి యంత బద్మరా
గారుణ హేమ కేసరిమయాసన మందె నమాత్యసన్నిధిన్

అంత మహాసభా కలవిహంగమముం దన ఱెక్క లార్చి వి
శ్రాంతి భజించులీలc బరిషన్నిలయమ్ము విశాల శాంత భా
వాంతరలీన మయ్యెc దరుణావసర మ్మని యుజ్జ్వల జ్జటా
కాంతుల నిల్చె రాజసముఖమ్మున నమ్ముని శిష్యపాళియున్

అమరుక దేవ శాంత హృదయమ్మున కమ్ముని వృత్త మంత సం
భ్రమమున విన్నవింపc జికురప్రకరాంచల నమ్ర మౌళి భా
గ మణి సుదేవ మంత్రి పలుకం దొరకొన్న నిమేషలేశమం
దమరె నరేంద్రలోచన యుగాంతరపాళి మునీంద్రదీపికల్

ఆ ఋషిలోచనాంకుర మయ ప్రభలం గన రాజమానసా
కార గుహాంతరమ్మున నఖండ మహోజ్జ్వల కాంతులంతc గ్రొ
క్కారు మెరుంగులై నలుమొగమ్ములc బారిన దూరసాగరోం
కార మనోహర స్వర మొకానొక లోకము దోచె వెల్గులన్

రాజహృ దంతరాళ వివరమ్మున నుజ్జ్వల సంప్రమోద మే
దో జనియించి మారుత జయోన్నత సాగరలీల వేగ వి
భ్రాజిత భావనోర్ముల్c జిరమ్ము కలంగునుగాని, కారణ
మ్మే జననాథ మానస మొకింత యెరుంగని దయ్యె నెంతకున్

బహూ విషయాంత రావృత నృపస్మృతి విద్రుమ పేటికా పురా
నిహిత మనంత కాంతి కమనీయ మనశ్వర మాత్మలోక స
న్నిహిత మమూల్య రత్న రమణీయ కిరీట మొకం డెదో మహా
మహిత నిజప్రభా తరుణిమమ్మున వెల్గె నవోదయప్రథన్

అపుడపుడు న్నరేశ్వర హృదంతర తీరమునుండి యేగుచుం
జపల సువర్ణ పర్ణ రథసమ్ములతో మెరుగుంబులుఁంగులుం
దపదప రెక్క లార్చి వినుదారి సుదూరము బారు దీర్చి యా
నృపనయనాగ్రసీమ హావణించె వెలుంగుల రంగవల్లులన్

అతఁ డున్మాద వశీకృతాంతరమునం దారీతి న త్తాపసా
కృతుల న్నిశ్చల వీక్షణమ్ముల విలోకించుం గడుం; దీవ్రమో
హిత సర్వేంద్రియ నిద్రితాంతరమునం దేకాగ్రతం జెందు; నా
నత మౌళిం దన మంత్రి వాకొనిన మౌనమ్మందు నిట్టూర్పుచున్

ఆవిధిఁ జిత్రభావ నివహమ్ముల సంశయ డోలికా నితాం
తావృత మా నృపాల హృదయమ్ము నెరింగి, యొకింత వేచి, యో
గ్యావసరమ్మునం దన హృదంతర భావ మెరుంగఁ జేయు సం
భావన మంత్రియున్ నృపసభన్ నిలిచెన్ దర నమ్ర మౌళి యై

మంత్రివరుం బ్రణామ వినమ న్నిజ దేహుని గాంచి, యంతలో
మంత్రవిముగ్ధ పన్నగ సమప్రభ చేతనతం గడున్, సమా
మంత్రిత మౌనివర్యుల నమంద ముదమ్మునఁ జూచె, వల్లకీ
తంత్రుల క్రొమ్మెరుంగుల నితాంత విమోహితుఁ డన్నరేంద్రుఁడున్

దేవ మనఃప్రియమ్ముగ నతిప్రమదమ్మున మౌనివృత్త మెం
తే వచియింపఁ గోరియు, నరేంద్ర నిరాదృతి, నా ఋషీంద్రభా
వావహితమ్ము రాజహృదయమ్ము నెరింగి, సుదేవమంత్రి తా
నే విఫలోద్యమమ్మున నొకించుక యాగె సుఖాసన స్థితిన్

శాంత మనంత పౌర పరిష న్నిలయమ్ము సమస్తముం బ్రశాం
తాంతర నిర్మలోదక చయమ్ములఁ గొమ్మలనీడలం దటా
కాంతరశోభ; రాజహృదయమ్మననే ఋషికాంతికీల, యే
కాంత మనోహరమ్మయి నిరంతరము న్నటియించె వెల్గులన్

జయ ! జయ ! మానవేంద్ర ! సువిశాల మహీతల సర్వభోగ సం
చయ పరితోషితాంతర ! యశస్వి వరామరుకేశ్వరా ! మముం
దయఁ బరికింపుమన్న విశద ప్వన ఘోషణ మంత, నా సభా
లయమున మ్రోగె నమ్మునిగళమ్ముల నొక్కపరిం ధ్వనించుచున్

వారి గళారవ మ్మవనిపాలక నీరవ కర్ణశాళి, గం
భీర విరావ దివ్య జయభేరి విధమ్మున మ్రోయ, శాంత సం
చార నరేంద్ర మానస మచంచల దీపికవోలె నిల్చి వి
స్తార పురాస్మృతిన్ బహువిధమ్ముల నమ్మునివర్యులం గనెన్

సంశయ శృంఖలమ్ము సహసా బహు ఖండము లయ్యెఁ, దన్మనో
వంశ గళమ్మునం దతినవమ్ము లపూర్వము లైన గీత నా
దాంశము లుద్భవిల్లె హృదయమ్మున నమ్మునివర్యులం బ్రభా
వాంశు వితాన విస్ఫుర దహస్కరులం దలచెం గ్రమమ్ముగన్

అల్లన హేమకేసరి మయాసనమ్ముం డిగి నిల్చి, మేదినీ
వల్లభుఁ డమ్మునీంద్రుల జవమ్మునఁ జేరగఁ బోవులీలఁ జం
చ ల్లలనా కరాంగుళీ విసారిత చామర దండ చంచలా
వల్లికలందుఁ విస్మిత సభాస్థలి నిల్చె నచంచలాక్షులన్

అమరుక విభ్రమాకుల హృదంతర భావ మెరింగి యా సుదే
వ మహిత మంత్రియుం గడు జవమ్ముగఁ జెప్పగ సన్నజేయ,సం
భ్రమ పరిసర్పణమ్ముల నథం గయిసేసి, నరేంద్ర సన్నిధిం
దమ విలస జ్జటాంచల శతమ్ముల నిల్చిరి మౌనిశిష్యులున్

వారల నిశ్చలాంబక సభాగృహ విస్మయ దృశ్యమాన శో
భా రవిమూర్తులం గడు నవారిత వీక్షల నించుకంత క
న్నార నృపుండు కన్గొని, "మహాఋషి వర్యుల మిమ్ము నందఱం
దూర పురాస్మృతిం భయముతోఁ దలతుం గద ! నెమ్మనమ్మునన్

కాని మహోదయ స్మృతి వికస్వర మానస దర్పణమ్ము సం
ధ్యానవ చంద్రకాంత నివహమ్ములఁ బోలుచు నంతలోన నే
మో నిలువెల్ల నొక్కపరి నూరక సంశయ భిన్న మయ్యెఁ; నో
మౌనికుమారులార ! లవమాత్రము సంస్కృతియు న్నశించెడిన్

మిమ్ముఁ దలంతు నా స్మృతినిమీలిత మూర్తులఁ బూర్వకాల పూ
రమ్మున నెన్నడో యొక తరంగమునం గనిపించి, కొంత కా
లమ్ము మహాప్రవాహ సలిలమ్మునఁ గూడినలీల; దూరభా
వమ్మున నాచరిత్రము లవమ్మును సంస్కృతితో నశించెనో !

ఒకపరి నామనమ్మున మహోజ్జ్వల వైద్యుతకాంతి వెల్గి, మీ
సకల పురాణ వృత్తము వెసం గనుఁగొన్నటుఁ దోచెడిం బురా
సుకృత ఫలమ్ము పండెనొ ! సుశోభిత నేత్రమునం గ్రమమ్ముగం
బ్రకట కథానక మ్మెదొ ! విభాసిలు నాంతర సౌహృదద్యుతిన్

ఒక్కొకసారి సర్వము నెదో ! భయదమ్ము తమమ్ము గ్రమ్మి న
ల్దిక్కులఁ దారకాళి నవలీలఁ గ్రసించువిధమ్ము దోచినం
బెక్కులు వ్రక్క లయ్యెఁ గడు వేదనలం బ్రదు కెల్ల, మీరలే
దిక్కయి సంశయమ్ముఁ గడతేర్పగ నేర్పరు లింక నేఁ డనెన్

ఆ నరదేవ మౌనసమయమ్మున నమ్మునిశిష్యులుం గనుం
గోనల బాష్పరాజి, రుచికోటి సముజ్జ్వల కుండలమ్ము లా
శోణ మణి ప్రభా ద్యుతుల సూచికలం దరశింప, భూవరా
స్థాన తలమ్మునం దతి విషణ్ణ ముఖమ్ములఁ జూచి రాప్రభున్

ఆ ఋషిపాళినుండి వినయమ్మున మెల్లన నేగుదెంచి, లో
లారుణ వల్కలాంచల మవంతర ముద్ధుర వహ్నికీలికా
చారు విధమ్మునం బ్రభ లసంఖ్యము లై జ్వలియింప, సుందరా
కార యతీంద్ర వైణికుఁ డొకం డనె నంత సగద్గద ధ్వనిన్

ఓ ప్రభువర్య ! మిమ్ముల నెదో ! కలచెం బ్రకటేంద్రజాల మా
యాప్రభవమ్ము మోహమొ ! నిరంతర సీధు విపాన లోల మే
ధా ప్రబల భ్రమమ్మొ ! యెడదం దమ రందఱు విస్మరింపఁ బో
నీ ! ప్రియ పద్మపాదు నొకయించుక సంస్మరియింపలే రొకో !

తమ రాచార్య మహేంద్ర శంకరు లనంతప్రజ్ఞు లజ్ఞానమో
హ మహాహస్కర మూర్తులుం దమకు నేనై విన్నవింపం ద్రపా
గమ సంకోచము నందెదం బ్రచలితా ఖండైక మోదమ్మునం
బ్రమకుం దావల ముందునో! యని విచార మ్మందెద న్నెమ్మదిన్

మండనమిశ్ర పూజ్యపద మందిరమం దొక వాదముం గళా
పండిత విప్రదార గరువమ్మున గెల్చిన నామెఁ జిత్కళా
మండితు లయ్యుఁ గోరిరి సమమ్ము జయావధి; యంత జొచ్చిరా
ఖండల వైభవామరుక కాయమునం దిది విస్మరించిరో!

వీరలు తోటకాహ్వాయు లభేద మత ప్రథితానుయాయి దీ
క్షా రుచిర ప్రభం గమలసంభవలీల సముజ్జ్వలాంగు ల
వ్వారె భవత్ప్రసాద సముపార్జిత శాశ్వత దివ్య సత్య శో
భా రవిమూర్తులుం భువన వంద్యులు దేవరశిష్య లందఱున్

అని ముని విన్నవించి, సమనంతర వాక్యపదాక్షరమ్ముఁ గై
కొన గమకించునంత దనకుం బులకల్ మెయి నిండి పార, న
జ్జనపతి మూర్ఛనందె; వరుసం బరిచారిక లంత సంభ్రమ
జ్జనగణ మంత్రివర్య పరిసంవృతు నా ప్రభుఁ గొల్చి రాదృతిన్

నరపతి యంతఁ గొంత లలనాకర చంచల తాళవృంత మం
థర సురభి ప్రచార పవన ప్రకరమ్ముల హేమకంకణో
త్కర మధుర స్వరమ్ముల సుగంధ మనోహర సాంద్ర చందనాం
గ రచనలం గ్రమమ్ముగ సుకమ్ముగఁ దేరుకొనెం బ్రశాంతుఁడై



శాంత మనంత వేదన విశాంపతి మానససీమ విశ్వ లా
స్యాంత మనంగఁ దోచెఁ; దదనంతర మన్నియు సందియమ్ము లా
వంతయు గోచరింపవు; నిరంతర సుప్తిఁ దనంత లేచి, యొ
క్కింత విలోచనద్వయి నరేశ్వరుఁ డల్లన విచ్చె మెల్లనన్

అమరుక దేవరూప మనయమ్ము ధరించిన మానసమ్మునం
భ్రమ యయి పోయె సర్వ మనురాగ మొకానొక పూర్వజన్మ వి
భ్రమకథనమ్ము పోలిక; నభంగురమై విలసిల్లు భోగ వృ
త్త మఖిల మింద్రజాలము విధమ్మున వెల్గె విలోచనద్వయిన్

తా నవనీశ్వరుం డని వృథా భ్రమ యయ్యె; నభిన్న బ్రహ్మవి
జ్ఞాన విభాసుర మ్మఖిల సంశయ శూన్య మనేక శిష్యసం
తాన విమోహ నాశక పద మ్మల శంకరరూప మందె; నా
పై నిరుపాధికాత్మత జవమ్మున నిండె సమస్త విశ్వమున్

అధరమణిం దరస్మిత మహమ్మున సంస్మృతివీధికా మనో
రథ రథలీల విభ్రమ చర న్మదిరాక్షులఁ, గామలాలసా
వధిక విచిత్ర భోగ పరభాగములం బ్రియ కింశుకప్రభా
విధుర మనోనురాగ పదవీ క్రమముం దలచెం గ్రమమ్ముగన్

తనమదిలో సమస్తము వృథాభ్రమమయ్యె, చిర కింశుకప్రభా
ప్రణయముగూడ నొక్క నిదురం గలయై విలసిల్ల, రాజనం
దన పరిసేవితా మరుక ధన్యపదమ్మున నారసుందరీ
గణ నవ యౌవనోత్సవ సుఖ మ్మొక రూపకమై కనంబడెన్

సార చరాచరప్రకృతి సంభవ పాలన నాశనాది కా
ధార మనంత బ్రహ్మ మనిదం పద గోచరముం దనంతఁ దా
నై రహి మించియు న్నిజహృదంతర శంకర భావ మంతటం
భూరమణాకృతిం గని యపూర్వ మనోభ్రమ మెంచె నాత్మలో

సకల విచార సంశయ విషాద విదూర మహాత్మ నిర్వృతిం
బ్రకటిత దివ్యభావ శిఖరమ్మున నిల్చి, యపూర్వ భావనా
వికల నిజాంతరాళ పదవీ పరికల్పిత శంకరాది నా
మక నిజ చిత్రగాథలఁ గ్రమ్మున నెమ్మిఁ దలంచె మెల్లనన్

ప్రథమమునన్ మనమ్మున జరామృతిశూన్య మనంతసృష్టి సం
గ్రథన విచిత్ర తంతు రుచిర మ్మగు శాశ్వత బ్రహ్మరూప సు
ప్రథిత పదమ్ము నంది, నిజభావమునం దలంచెం బ్రపంచముం
బ్రథిత కథానక మ్మదో విచిత్రరుచిం బ్రభవించులీలగన్

ఆపయి బ్రహ్మవిద్య భువనాంతర మెల్ల వెలుంగ జేయ లో
కోపకృతిం దలంచి, సుముహూర్తమునం దొక విప్రగేహ దో
లాపరిపూర్ణ పంకజ తలమ్మునఁ గర్ణికవోలె శంకరా
ఖ్యా పరిపూత సర్వ జగదందరతం జనియించుటం గనెన్

తదనంతరమ్ము బాల్యప్రాయమునయందె
బ్రహ్మవిజ్ఞాన సారమ్ము నెరిగి,
సర్వసంగ విమోహ సన్యాస మొనరించి,
మాన్య తురీయాశ్రమమ్ము నంది,

ప్రతివాది కరిఘటా భంజన మ్మొనరింప
భావమ్మునం దొక్క ప్రతిన వట్టి,
దేశదేశమ్ములం దివ్య మద్వైత సం
దేశముం బ్రతినినాదింపఁ జేసి

సత్యమార్గమ్ము సంప్రకాశ మ్మొనర్ప,
సర్వ శిష్య పరంపరా సమితి గలిసి,
విప్ర మండనమిశ్ర సంవేశసీమ,
వాద మందిన విధము సర్వమ్ముఁ దలచె

ఆపై మండనమిశ్రయజ్వ తన వాదాంతమ్మునం దోడి, ల
జ్జాపర్యాకుల భావ మందె విలువం జంకించి తద్దార రో
షా పూర్ణాక్షరయై, సగమ్మె జయ; మార్యా! నన్ను వాదమ్మునం
దాపూర్వమ్ముగ గెల్వఁ దన్న వచన మ్మంతం దలంచెన్ మదిన్

ఆమెతో మన్మథ కళాగమాంత రహస్య
వాదమ్ములందు వివాద మంది
ఆజన్మ బ్రహ్మచర్యమ్ము నందుటజేసి
చతుర చర్చలఁ బరాజయము నంది
వత్సర సమయ మ్మవధి గాగ నియమించి,
కామరహస్య సంగ్రహముఁ గోరి
అమరుక రాజరాజాధీశ దేహమ్ముఁ
బ్రాణశూన్యముగ నాలోనఁ దెలిసి

మహిత పరకాయవిద్య న మ్మనుజదేవ
సుందర శరీర హృదయమ్ములం దమంద
కామ భోగ చిర ప్రసంగమ్ములం, ద
నంత మోదానుభావమ్ము నాత్మ నెంచె

అమరుక భావ మంది సమనంతర మున్నియు విస్మరించి, వి
భ్రమ రమణీయ భామలఁ జిర మ్ముపభోగము లంది సర్వభా
వముల మహాప్రమోద విభవమ్ముల నందుచుఁ గింశుకప్రభా
రమణి మనోనురాగ రుచిర ప్రభఁ గాంచుట యెంచె మెల్లగన్

ఆ లోలాలక లాసికారమణులం దా తీవ్ర రాగమ్ములం
దా లాస్యావళియందు సర్వమును మాయాజాలమం దున్న చే
తో లీలం గని, కింశుకప్రతిభయుఁ దా దూరోచ్చలానంద దో
లా లోలాంతర భోగ మందు టది యెల్లం గాంచె నిర్లిప్తతన్

ఆలోన దూరవంశీ లోల రవ మేదొ
హృదయాంతర గుహం ధ్వనించి యుంట
ఆ మురళీ నినాదాకర్ణనమునందు
సర్వభోగములం బ్రసక్తి విడుట,
ఒకరేయి రమ్య లాసికల పాళికలందు
కింశుకప్రభ నృత్యకేళి గనుట
ఆరేయి లాస్యకాలాంతమం దాకాంత
స్వీయముం బ్రేమమాసించి చనుట

మరల నా దూర వేణు మంథర రవమ్ము
కింశుకప్రిభ కథన మ్మఖిలము; తూర్ణ
ముని కుమార సభా ప్రివేశనము; సర్వ
మొక్క చిత్రి స్వరూపమం దుల్లసిల్లె

తన సందేహతరంగ నృత్యముల శాంత మ్మందగం జేసి, యొ
క్క నిమేషమ్మున నాత్మగాథ హృదయాకాశమ్మునం దోప, న
మ్మునిసంఘమ్మునఁ బద్మపాదఋషి సమ్మోదమ్మునం బూస గ్రు
చ్చిన చందమ్మున విన్నవింప మది నెంచెం ద న్నిజానందమున్

సందియ మెల్లఁ దీరె వరుసం దన వృత్తము సర్వము న్నిజా
నందకరమ్ముగం దన మనమ్మున నల్లన గోచరించెఁ; దా
నుం దన కింశుకప్రభయునుం బ్రణయమ్మున నుల్లసిల్లు గా
థం దలపం దొడంగెఁ గనుఁదమ్ముల సస్మిత బాష్పధారలన్

కనుఁగన నిశ్చలప్రభ నకంపిత చిత్తమునం బ్రపంచ మ
ల్లన మహితాత్మమై వెలుగులం జ్వలియింపగ నాత్మలోన న
వ్వన ధరణీ ధరా ర్ణవ విభాసుర మా ప్రకృతి, స్వరూప వ
ర్తనమున నుల్లసిల్లిన విధమ్మునఁ గాంచె నచంచలాక్షిలన్

భూత భవ ద్భవిష్య దభిపూరిత కాల మహాస్రవంతి, తా
నే తన యాన మెల్ల విరమించి నిమేషమునం బ్రశాంత భా
వాతిగభీర మైన సభయందలి శిష్యులఁ బద్మపాదుఁ బ్రే
మాతిశయమ్మునం గని విమోహ భ్రాంతి శాంత మ్మనెన్

నే నై యీ నృపదేహ పంజర సమానీతాంత రాళమ్మునన్
నానా కామకళా రహస్యముల నెన్నం గోరి, యీరీతి, భో
గానందమ్మున మున్గి విస్మృతి విపర్యాసమ్ము నందం గడుం
గానం జిత్రము సు మ్మనె న్మని విశంక ప్రోల్లస ద్వీక్షలన్

ఆ వచనావసాన సమయమ్మున నాసభ మంత్రి పౌర వృ
ద్ధావళి యెల్ల విస్మిత హృదంతరమై విలువం బ్రసన్న శి
ష్యావృత పద్మపాదులు"జయమ్ము! జయమ్ము!జయమ్ము బ్రహ్మవి
ద్యావరదాయి శంకర మహా గురువర్యుల కంచు మ్రొక్కినన్

అంతిపురమ్మునందలి నృపాంగన లెల్లరు సంభ్రమోచ్ఛల
ద్దంతి వర ప్రియా ద్రుత గతమ్ముల నాసభ కేగుదెంచి వి
భ్రాంత విలోచనాంకురిత బాష్పములన్ బ్రియు గాంచి రంతఁ గం
ఠాంతర లీన రోదనమయ స్వన మెల్లెడ మారుమ్రోయగన్

భయ రయ విస్మయమ్ముల సభం దన పాదము లంటఁ గేశసం
చయము సువర్ణరాశి వికచ ప్రభ లీనిన కింశుకప్రభం
బ్రియమునఁ గాంచి శంకరు లభీప్సిత మ స్తమనంత నెల్ల సం
దియములు దీర హర్ష సముదీర్ణ జలేక్షణ యయ్యె నామెయున్

నమ్ర మునీంద్ర శిష్య పరిణద్ధ జటారుణ కాంతులం బ్రభా
కమ్ర నరేంద్ర యౌవత ముఖమ్ములఁ జారిన కైశ్య నీలిమా
భా మృదు రేఖలన్ నృపసభం దహనోన్నత జిహ్వాకాంచలా
శ్రామ మరీచి నర్తన విధమ్ముగఁ దోచె విచిత్ర కాంతులన్

దహన పరీత గేహము విధమ్మున వెల్గిన న మ్మహాసభా
గృహమున శిష్యసంఘము లోగిం బఠియింప బ్రహ్మవా
ద హృదయ మోహి మంత్రము లతంద్రిత వీక్షల నంత నమ్మహా
మహిత నరేశ్వరాకృతి యమంద సమాధి విలీనతం గనెన్

ఓ మ్మను శిష్య కంఠ వివహోన్నత నాదము లా సదస్య క
ర్ణమ్ముల సింహగర్జన విరావ విధమ్మున మ్రోయు, నొక్క తే
జ మ్మవనీంద్రునుండి విలస జ్జనలోచన గోళకమ్ములం
గ్రమ్మర దీపకాంతి వెలుగం దివి కేగె మహోజ్జ్వల ద్యుతిన్

హాహారవమ్ములం దవరోధ రమణి మ
హాక్రంద ఘోషణ మ్మలమికొనగ,
అమరుకేశ్వర పాద రమణీయ పీఠికం
గింశుకప్రభయు శోకించి ప్రాల
పౌర వృద్ధా మాత్య బంధు సంఘమ్ములం
దూర విభ్రాంతి విస్తార మంద
రాజోపచార సంభార హస్తమ్ములం
బరిచారికా శ్రేణి పరువు లిడగ

సస్మితా చార్య శిష్య ప్రశాంతి రచిత
పూర్ణ సాష్టాంగ వందనా పూరితమ్ము
అమరుకేశ్వర హైమ సభాంగణమ్ము
ప్రబల విస్మయ పూర్ణ సంభ్రమము గొలిపె

ఆ విభ్రాంత సభాంగణ ప్రచల హాహాకార మం దంతటం
దావజ్వాల గతిఁ మహోంకృతి నినాద మ్మొల్లెడన్ విండ రా
జావాసమ్మును వీడి మౌనినికర మ్మతం దొలంగెం గురుం
భావానందకరుం గుహాంతరగతుం బ్రత్యక్ష మూర్తిం గనన్

వారలవెంట శంకర కృపా పరిపాలిత కింశుకప్రభా
వార విలాసినీ మ ణి సభాగృహ మల్లన వీడి యేగెఁ గాం
తార నివాస మంది నియత వ్రత చర్యల నా చరాచరా
కారుఁ బరాత్పరుం బ్రియు నఖండ చిరాకృతిఁ గొల్వ నెమ్మదిన్

ఒక రొకరై సదస్యులు ముహూర్తమునం దయ ధార శంప్ర మ
స్తక పరిలోల కుండల లస న్మణికాంతుల నీల సాంధ్య కా
లిక తిమిరావళిం బరివిలీనత నందుచు నా సమస్త దై
వికి విషయమ్ములుం దమ మనీషల నెంచుచు వీడి రా సభన్

భో రను నాద మెల్లెడ నపూర్వ విధమ్ముగ మారుమ్రోయ, భే
రీరవ మిశ్రితం బరిపరిం ధ్వనియించు నగార లంత, లో
కారవమే విచారమయమై స్వనియించినరీతి, శాంత గం
భీర విధిం దిశాంత పదవిం బడి మ్రోగె సగద్గద ధ్వనిన్

ఆ నినదమ్ము దేవళములందలి మంద వినాద ఘంటికా
స్వానములై ధ్వనించి, వరుసం బహుళోంకృతులం జరాచరే
శాన దినావసాన విలస ల్లయతాండవ వేళఁ బాదపూ
జా నవ పుష్పలీలగ వెసం గయిసేసెను మెల్లమెల్లగన్.

# మణిదీపిక

శ్రీ శారదా శతవార్షికోత్సవ ప్రచురణము

శ్రీ పి. గణపతిశాస్త్రి




శ్రీ రామకృష్ణమఠము
రాజమహేంద్రవరము

శ్రీ శారదా శతవార్షికోత్సవ ప్రచురణము.

ప్రకాశకులు:
శ్రీ రామకృష్ణమఠాధ్యక్షులు
రాజమహేంద్రవరము
1954

వెల: అర్ధ రూపాయి



ముద్రణ:
ఆంధ్రపత్రికా ముద్రణాలయము
చెన్నపట్టణము.



# అంకితము

మిత్రుడు

శ్రీ చేబ్రోలు సుబ్రహ్మణ్యశర్మకు



# పీఠిక

మణిదీపిక వృత్తాలన్నీ ఒకే కాలంలో రచించినవి కావు. వీటిలో చాలాభాగం అయిదారేళ్లకు పూర్వమే వ్రాసినవి. ఇటీవల వ్రాసినవి అన్నీ కలిసి ఇరవైకంటె ఎక్కువ ఉండవు.

వీటి అన్నింటిలోను అంతరాంతరాల్లో ఒకే విధమైన భక్తిభావన అనుస్యూతంగా స్ఫురించడంవల్ల ఇవ్వన్నీ ఈ సంకలనంలో చేర్చాను.

మణిదీపికలో చాలావరకన్నీ ముక్తకాలే. కొన్ని చోట్ల రెండు, మూడు, నాలుగైదు వృత్తాలలో ఒకే ప్రత్యేకభావం స్ఫురించవచ్చును.

కొంత కాలంనించీ ఇవి ప్రకటించాలని సంకల్పం. దీనికి మిత్రుడు చేబ్రోలు సుబ్రహ్మణ్యశర్మ ప్రోత్సాహం తోడుపడింది. ఇంతలో రాజమహేంద్రవరం రామకృష్ణ మఠాధ్యక్షులిది ప్రకటించడానికంగీకరించారు. వారి అంగీకారమే శ్రీ శారదా శతవార్షికోత్సవ సమయంలో 'మణిదీపిక' గా వెలిగినది !

జీవితంలో ఒకొక్కప్పుడేదో అదృష్టంకలిసి వచ్చినట్లనిపిస్తుంది. ఈ ఉత్సవసమయంలో ఇది ప్రకటించడంవల్ల సరిగా నాకిలాంటిస్ఫురణే కలిగింది. రాజమహేంద్రవర మహాధ్యక్షులకీ సందర్భంలో నా కృతజ్ఞత తెలియజేసుకొంటున్నాను.

కావ్యగుణాగుణనిర్ణేతలు సహృదయులే. కాని మణిదీపిక అంతా మళ్లీ చదివేసరికి నా భావనలో ఛాయామాత్రంగానైనా దీనిలో రూపొందలేదని అనిపించిది. ఇలాగంటే తిరిగి ఇది ఒక అహంభావంగా స్ఫురించవచ్చునేమో! కొంత రచనానుభవం ఉన్నవారి కిలాంటి అసంతృప్తి తప్పనిది!

ఆంధ్రపత్రికాముద్రణాలయం వారిది సకాలంలో ముద్రించి ఇచ్చారు. చిత్రకారమిత్రులు శ్రీ దశిక రామలింగేశ్వర రావుగారు మణిదీపిక ముఖచిత్రం చిత్రించారు.

వీరందరికీ నాకృతజ్ఞత.

పి. గణపతి శాస్త్రి.

# మణిదీపిక

శారదనీరదావళి విశాలదిశాంతర కౌముదీ నదీ
నీరవనీరపూరసరణిం గదలెం దెరచాపలై! జగ
త్తీరము జేరుకో బయలుదేరిన హీరవిహారనౌకలో
య్యారము లొల్కఁ బోసినటు లయ్యెదళుక్కను రిక్కవెల్గులన్!

అల్లన పిల్లతెమ్మెర విహాయసవాహిని వీచెనో! జగ
మ్మెల్లెడ నుల్లసిల్లి పులకింప, దటాంచల కాశరాశి య
ల్లల్లన ధారుణీజనని యాదల రాలెనిదే! చెలంగి మ
త్తిల్లిన పాలవెల్లి తమిదీర నదే గతి నింగి బొంగడిన్!

తీయనిగేయమై, వసుమతిం దోలియామని మావిరెమ్మలో
కోయిలహాయిలో ప్రథమకూజిత మోహనమై, ‘బిరాన రా
రే! యమునాతటీ విహారణేందిరలై వ్రజగోపభామ లా
రా!’యని పండువెన్నెల నిరంతర వేణురవమ్ము పిల్చెడిన్!

ఎన్నటిదమ్మ! నీ పిలు పాకేగతి నన్ గలగించె మంద ఖే
లన్నవ శారదానిలవిలాసములం దెలిరెల్లుగొంతులో
నన్నని పాటయై! పరవశమ్మయి నాయెద రెక్కలార్చి యీ
వెన్నెలబాటలో గగనవీథి మరాళగతిం జరించెడిన్!

పాయని పూర్వపుణ్య పరిపాకమునన్ మనసార నోర స
మ్మా! యని పిల్చినంత ఘనమయ్యెను గద్గదగీతి! కన్నత
ల్లీ! యిక నీవె నెమ్మది నోకించుక నిల్వగదమ్మ! కచ్ఛపీ
గేయఝరీతరంగ ముఖరించెద మువ్వలరవ్వనవ్వులన్!

కవనవనాన శాశ్వతసుగంధమనోజ్ఞము లార్ద్రభావనా
నవనవమంజరీదళవినమ్రసుమమ్ములు దోయిలించి, మైం
దవమణిపీఠి గొల్వాయి సదావరదానతపాణివైన నీ
భవనకవీంద్రవైభవశుభమ్ము లభించె నటంచు బొంగితిన్.

ఏ చిరజన్మపుణ్యఫల మిమ్మెయి నిమ్మగ బండెనోగద
మ్మా! చరణాంకితమ్ము హృదయమ్మలరెన్ లసదిందుజాహ్నవీ
వీచికమై! తదీయసిత ఫేనసలీలవిలోలకుందమా
లా చలడోలపై కలకల నన్న మందగళ స్వరాళమై!

తెల్లని రెల్లుపూల తరితీపుల చేలచెరంగుతో ధరా
వల్లకచిత్రకార చరణాంకన కుంకుమరేఖతో కృపా
వల్లరులై తలిర్చు దృగపాంగ సుశీతలవీక్షలన్ గృహ
మ్మెల్లి వెలుంగ జేయగదవే! హృదయాంగణ రంగవల్లికా!

తెలి తెలి పాలజల్లులయి, తీయని నీ కరుణా వియన్నదీ
జలపరివాహమై విశద శారదకౌముది నిలసాంధ్య నే
ఖల దరళించినంత కనులం గళదశ్రువు లొల్క సంభ్రమో
చ్ఛ్వలిత మెడంద నీ పదదిశం బయనించె మహోవిహంగమై!

ఇది నిరుపేదగుండె ఒకయించుక నీ దలపోసినంత న
మ్మదమున మత్త బర్హిణ సమానగతిం బురివిచ్చియాడెఁ! న
భ్యుదిత శుచిస్మితోల్లసిత కుండలమై భవదీయమూర్తి క
ట్టెదుట నొకింత నిల్వ మరి యాబ్రదు కేగతి దేలియాడునో!

నీమణిపాదుకారుణఘృణిస్ఫురణమ్మొక రత్నదీప శో
భామహనీయభాగ్య మొదవం గరుణించిన దంచు నాతలం
పే మరి తావకార్చనమహీమసృణాగరుధూపధూమాలగా,
మామకదేహ మాభరణమంగళపీఠికగా నమర్చెదన్!

నాకనులం జెలంగుచు ననారత మీ శరదిందుశుభ్ర శే
ఖాకృతు లొక్కరూపయి హృదంతరపీఠికపై నమర్చె ము
క్తా కమనీయ సుస్మిత వికస్వరముల్, లసదింద్రచాప శో
భాకరధూళి తావకమహశ్శివమూర్తి వెలింగి నిండగన్!

ఆరతులై సమున్నతనభోంగణతారక లందలేని మం
దారయుగమ్మ నీ మృదుపదద్వయి వెల్గునుతల్లి! దుఃఖపూ
రారుణనేత్రులై, శ్రమభరానతులై, హతభాగ్య దీపికాం
కూరులునైన దీనుల వికుంచిత జీర్ణకుటీప్రభాతమై !

పదలాక్షారుణిమల్ చెలంగ వినమద్వర్షాభ్రనీలా! దురా
పదలన్ ప్రీలిన పేదగుండియల జృంభద్రక్తధారాఝరీ
పదవి న్నీ వరుదెంచి, వత్సలత నాపన్నక్షతాళిన్ క్షమా
మృదుబాష్పావళి జార నద్దెదవు నెమ్మోన్ గల్ల కాశ్మీరముల్!

దీనులు దుఃఖశూలపరిదిగ్ధ హృదంతరు లుగ్రనిత్య భా
రానతులై విషణ్ణ నయనాంతర నిశ్రుతి తేక్షులం గనుం
గోనల బాష్పధారల నినుం దలపోసిన యంత మ్రోగు నా
ర్ద్రాననమైన నీ మృదుపదాంకితనూపురకమ్ర కింకిణుల్!

అహరహముం బ్రఫుల్లదళమై స్థిరమై భవదీయవేదనా
దహనసువర్ణతామరసదామము నీ పదధామ మందుకో
దహతహ ముమ్మరింప నరుతం గయిసేయుదువమ్మ! విస్మయా
వహములు నీదు శాస్త్రలు కృపానమితాభయహస్తగుప్తముల్

పారములేని శోకము కృపాప్రవణా! భవదీక్షణాంత వి
స్ఫారితమై, హృదంతరవిభావరిలో సతతమ్ము పుణ్యభా
గీరథివోలె నీ పదనికేతదిశం బయనించుగాని, నే
నేరక సేతునిర్మితిమనీష వృథా జతనమ్ము సల్పుదున్!

నీదయ తప్పినేని యవనిం గల భాగ్యములెల్ల కొల్లలై
పో దరిజేర్చి లోన మరపుం బెనుమ త్రోదవింతుగాని, నీ
పై దురదృష్టకంటకసుమావళి మాలిక గూర్చి, సంభృతా
ర్ద్రాదరవై, ప్రపన్నజనతాలకలం ఘటియింతు కాన్కగన్!

పరమాజ్ఞానవిమూఢదుర్ధనిగృహాద్వారమ్మునం జేరి త
ద్దరహాసాంకురమాత్రలబ్ధికయి మిథ్యాజీవనుల్ క్షుద్రకా
పురుషుల్ కుత్తుక లుత్తరించుకొన దుర్మోహాంధులై పోరు ని
ద్ధరపై నెవ్వఁడు నిల్చు నీ మకుటచంద్రస్ఫూర్తి లేకుండినన్!

నీపదధూళి మౌళి పావనింప దృగాంకురమే మహేంద్ర ల
క్ష్మీపద మందువన్న పరిశిష్టజనమ్ము గాసింప నేల న
మ్మా! పడిచచ్చిపోయెద రహంకృతితో మరి మందభాగ్యులా
రా! పరమార్థ మించుక రయన్ జిరున వ్వుదయించు నెమ్మదిన్.

అధికారాంధులు నిత్యజృంభిత మనోహంకారు లున్మత్తతా
బధిరశ్రోత్రులు మూర్ఖచిత్తులు ధనస్వాముల్! వృథాయయ్యె నీ
యధమప్రాభవసేవలం బ్రదుకు శూన్యప్రాయమై దుర్వ్యథా
మథితాంత స్సరసీ ప్రఫుల్ల శుభపద్మా! సద్మదీపప్రభా!

పూర్వజనుర్మహాదురితపుంజ మిటుల్ ఫలియించెగాక దు
ర్గర్వితనిత్యదాస్యనరకమ్మిది యేలఘటిల్లె! నింక నా
సర్వ మనఃప్రవృత్తి వికసన్నళిన మ్మగుచు న్నఖప్రభా
ధూర్వహతం గళచ్చరణధూళిమధూళిగ నుల్లసిల్లుతన్!

హృదయమ్ముత్కటవేదనాక్షుభితమయ్యెన్నిత్యమేహోదురా
పదలన్ ఫ్రీలి కవోష్ణరక్తమయ జంబాలమ్ముగా మారె! న
య్యెదియో! దుష్కృతిపాకముంచడలినా నెంతే విచారించి నే
డిది యుష్మచ్ఛరణారుణాంకనమహాస్మే యంచునుప్పొంగితిన్

నైరాశ్యాంధతమమ్మె మానసముగా, నానావిషాదాగ్నిద
గ్ధారణ్యమ్మె గృహమ్ముగా, మనికి వమ్మై సాగెగానీ, యుష
శ్శ్రీరమ్యస్మితమై భవన్ముఖము భాసింపం దృటిం దోచె నే
రా రాజుల్ సరిరారె నా కని మహోరాజీవభాగ్యేందిరా!

ఉదయమె వహ్నికీలగ సముద్ధతమై వెలుగం భరింపరా
నిది యగు జాగృతిం గనగ నేరని లోచనవీథి సర్వముం
బ్రదు కొక భగ్నదర్పణనిభమ్ముగ చూర్ణితమైన వేళ నో
హృదయనిధానమా! పలుకరింతువు! కన్నులుమూసినవ్వుచున్

మానవలోక ముగ్రరణమారణహేతిహతమ్ము ధూళిశ
య్యానిరతస్రవద్రుధిరమై పొరలాడు దినాంతవేళ, తా
రా నివహోల్లసన్మకుటరంజితచంద్రికవై, తృషార్తిదీ
నాననులం బ్రశాంతిమధురామృతధారల దేర్తు వంబికా!

అణుభేద మ్మొనరింపనేర్చెదము! రవ్వంతైన ధూళీలన
న్మణిహారమ్ములు గడ్డిపూల చిరువిన్నాణములు న్నేర్వ మో
ప్రణతేంద్రాదిసురావళీమకుటదీపా! పాద మంజీరకిం
కిణివిజ్ఞానకణ మ్మికేని జనధీక్షేత్రాళి భాసించునో!

నీనిశితత్రిశూలసరణిన్ రుధిరారుణరూపవై! మృడా
నీ! నిదురించి సోలు ధరణీహృదయమ్మున బ్రజ్వలించి, పా
షాణఘనాంధతామసి మృషానటనమ్ము హరించి, యయ్యుషో
భానుతళత్తళద్యుతి విభాసిలఁ జేయఁగదే! కృపామయీ!

నాస్త్రమ్ముల వహ్నికీలలు దిగంతమ్ముల్ దహింపన్, విషా
ణాసిం గ్రుమ్మిన చంద్రవంక దివి నల్లల్లాడ, రక్తాక్షులు
ద్భాసింపన్ మహిషేశ్వరుం డవని యుద్ధజ్వాలధూమాకృతిం
గాసింబెట్టెడు నమ్మ! రమ్మిక హృదాకాశ స్ఫురచ్చంద్రికా!

సునిశిత హేతువాదపరిశోధితభౌతికతత్త్వముల్, ప్రజా
ధన బధిరాధికార మహితమ్ములు తంత్రములెన్నియో ధరా
జనముల రంగుబొమ్మలు విషాదములై నశియించెడిన్ జగ
జ్జనని! కనుంగవల్ చలువజల్లుల దేల నిలం జ్వలింపుమీ!

శైశవకేళిజాలవివశప్రియసూనుని ముద్దు వెట్టి యా
యాసము వోవ జన్గుడిపి యల్లన జోలలు వాడు ధాత్రితీ
రై శివరూపిణీ! బహుపథాంతములన్నడయాడి తూలి యా
శాశల శూన్యదృష్టి గలయంగను పాంథులకై స్ఫురింపుమీ!

ఓకవిభావనోజ్జ్వల మయూరవిభాసిని! నీ మనోజ్ఞ రూ
పాకలనమ్ముతో ముదితు లయ్యెదరెందరొ తత్త్వవేత్త తే
నీ కరవాలభీకర విసీలిమ గాటుక వెట్టి వేదనా
వ్యాకృత మీ జగన్నిధిరహస్య మనంత మెరుంగ నేర్చిరిఁ !

వీణా నిక్వణ మోహినీ! కవిమనోవీథి న్నినాదించు నీ
వేణీజృంభితబంభరోంకృతులు గంభీర స్వనద్గాంగవా
ర్మాణిక్యక్వణనమ్ములై జగతి సర్వప్రాణి సమ్మోదకృ
ద్వేణుస్వానములై నదింప జనతాప్రేమార్ద్రవై రాగదే!

జగదాశామణిదీపికా! జనని! చంచన్నూపురాభాధగ
ద్ధగిత త్వత్పద రేణు వించుక యెడందం దూలెనే నింక ది
గ్దిగధీశానశిర స్తటీమకుటపంకేజాత సందోహ మం
దగ లే దిమ్మహనీయభాగ్య మని యున్మత్తుండనై యాడెదఁ!

శారద సాంధ్యవేళ వికసన్నవ కోకనదమ్ములం భవ
న్నీరవపాదచిహ్న రమణీయత లోన దలంచి, యశ్రుపూ
రారుణితేక్షణమ్ముల నిరంతర మా చరణాంకపూతకా
సారవినిర్మలాంతరలసజ్జలబిందుతకై తపించెదన్!

యౌవనముగ్ధమైన హృదయమ్మున గన్నకలల్ కపోల భా
గావిల బాష్పబిందుతతులై ప్రవహించెడు వేళ హారము
క్తావరమాలగా మెరయగా దయసేయగదే! ప్రఫుల్ల మ
ల్లీవికచస్మితమ్ము తరళించు దయానవనీతమూర్తివై!

పుత్తడిబొమ్మలంచు దలపోయుచు నిల్చితినూరకే! మృషా
మృత్తికలైన కాంతుల సమీపమునం జననీ! చిరవ్యథా
కృత్త హృదంతరమ్ము పరిఖిన్నతనైన నికం భవత్పదో
న్మత్తధరాపరాగచలనమ్మున రూపరు భాగ్య మందునో!

వ్యోమార్గోపనిషద్వధూభుజసువర్ణోంకారపల్యంకికా
ధామా! నీసితమూర్తి సర్వజగదాంధ్యమ్ముం దొలంగించు రా
కా ముగ్ధేందు శుచిస్మితమ్ముగ వెలుంగం జేసి, యజ్ఞాన ని
ద్రా మోహమ్మదలించు నూపురనినాదస్ఫూర్తి విచ్చేయుమీ!

శీకర సాగరోర్మి పరిభిన్నగతిం దరికాన
చీకటిబాటలం గదలనేరని జీవితనౌకకై ధ్రువా
శా కిరణమ్మవై తటదిశం దెలివెల్గుల తెన్ను జూప గ
కైక శరణ్యవై నడపుమీ! యలలే కలలై నశింపగన్!

ఆకలిగొన్న దీనజనతాంతరితా! మహితాన్నపూర్ణ! ము
క్త్యాకలవేగు జీవతతికై నవకైరవిణీవికాస భ
వ్యాకృతి నీశుచిస్మితమహా మ్మెరుకం గరుణించి, శాంతరా
కా కమనీయమై మెరయుగావుత! శారదసాంధ్య వేళలన్!

రంగువెలుంగు లెన్నియొ కరంగుచు నీడలునీడలై దివా
రంగమున న్నటించి తిమిరమ్మున రూపరినం జగమ్మొక
న్నుంగవ నొక్కమారుగ వినూతనగోఘృతదీప సౌమ్యమూ
ర్తిం గనిపించి, మౌక్తికగతిన్ మెరయింపగదే! తదశ్రువుల్!

నీతలపోత జీవతరణీగతికై పవమానపూర్ణ మా
శాతరళమ్ము పైడితెరచాపవలె న్నిరతమ్ము దారితో
డై తనియింప, నిత్యభయదారవసంకులజీవితాబ్ధి వీ
చీతతులే తమంత దరిజేర్పగ నే బయనింతు హేలగన్!

ఎంత మనోహరమ్ము జననీ! నవయౌవన వేళ నీవు నా
స్వాంత వసంతఖేలన మహమ్మున నిచ్చిన లోచనద్వయీ
కాంతమహేంద్రనీల మది! కన్నొరగించితి వంచెరుంగ నా
క్కింతయు! రేబవ లదేగతి నమ్మణితోడ నాడితిన్!

ఖేలనగాఢరక్తి దమకించిన చిత్తముతో విహాన్మరు
ల్లాలితవార్ధి మెల్ల నలలం దరళించిన సైకతమ్ము సం
ధ్యాలసమైన వేళ, హృదయమ్మున నమ్మణిదాల్చి, ఫాలలో
లాలకలం జరించితి నిరంతర తాళవనీపథమ్ములన్!

నామణి పారవైచికొనినా డొకనా డుదయారుణాశ్వ శో
భామిళ దబ్ధితీర చలభంగములం దిసుకల్ ప్రవాళచూ
ర్ణామల భంగిమల్ గొను పయోబ్ధితటాన తదాది సంద్రమం
దేమరకే గవేషణ యదే యొనరించితి నమ్మణిం గనన్!

విసువని యూ నిరంతరగవేషణయం దనలోకనాంతమం
దసువులె పోలి కన్నుగవ నశ్రుచయ మ్మురలం గరమ్ము న
ల్దైన లిరులైన వారినిధితీరమునం దుద కెట్టకేల కి
న్నిసి నినుగంటి నూపురమణిప్రభలం దరళార్ణవద్యుతిన్!

తళతళలాడె నీ చరణదర్శనవేళ మదీయకేళికా
గళితమహేంద్రనీలమణి కాంచననూపురలీనమై! వ్యథా
మిళితకవోష్ణబాష్పకణమీలితమై కనుదోయి నిల్చె మం
గళ పదపీఠి మ్రోల పరికల్పిత వీక్షణకోరకాంజలిన్!

కనుల దళత్తళల్ నిలువగా గళుకుల్ విరజిమ్మె, జీవిత
మ్మనుదినముం దినాంతిమనిశాంధతమమ్ముగ మారినంత నీ
ఘనతిమిరోపహారమెదకై యవినశ్వర నీలరత్న శో
భన మణిమాలగా, పగభాగ్యముగా గయిసేయ నెంచెదన్

ఆతతచిత్రజీవనమహామ్మున లాస్య మొనర్ప వచ్చి, యే
లో తమమువ్విధిం బథమయోమయమై గతిదప్పి, కామనా
ద్యూతమునం బణమ్ములు ముహుర్ముహురాశ లనోడువారికీ
వే తుదినీడ గూరిచి ఫలింతువు! కల్పకశాఖకాకృతిన్!

జీవనభూరుహాంతరవిచిత్రశుకావళిమై గతించె! నె
న్నో! వెలుగీయకే! బహుదినాంతిమసంధ్యలు! కానివానియా
నావసరమ్ములందలి నిరంతరనాద మిదే ధ్వనించె ‘నిం
దీ వరుదేర కుండుటసుమీ! సకలమ్ము వృథా సుహృన్మణీ!’

ఎంతటిభాగ్యమమ్మ ! వెలిగించెదు నీ హాసితమ్ము మెల్లనా
స్వాంతగృహాంతరమ్మున నచంచలచంద్రమణిప్రదీపికా
కాంతమనోజ్ఞకీల! అనిశమ్మిది జీవిత నిత్యయాత్ర నొ
క్కింత చలింపకే మెఱుమెఱుం దెలివెల్గుల తెన్ను జూపెడిన్

హీరవినిర్మలమ్ము భవదీయవికస్వరమూర్తి నిత్య సు
స్మేరదృగంతమై యెద వసించుట జేసి, రసార్ద్రభావనా
ప్రేరిత మీ సువృత్తచయమే తరళోర్మికలై కవిత్వ గం
భీర పయోధి నీ చరణపీఠిక జేర తుఱంగలించెడిన్ !

నల్లనిపిల్లమబ్బు గగనమ్మున మెల్లన దోచినంత నా
చల్లనితల్లి! నీస్మరణచందనశీతలమందవాత మ
ల్లల్లన సోకి నాయెద గళద్బహుళాశ్రువులై పొరింబొరిం
జల్లులు జల్లులై కరగి సాగె నటన్నవవార్షధారలన్ !

అసిధారాధిమణుల్ మహాగహనవేదాంతాధ్వాసినుల్ క్షమా
హాసిత ప్రస్ఫురితా! ఒకింత కనలేదమ్మా! భవన్మూర్తి, నే
నిసుకన్ మక్కువ నాటలాడు శిశువెంతే దవ్వునం దల్లి ని
న్నానలిట్టే గురుతించులీల నినుగన్గొంటి న్నిమేషంబునన్!

నీ శివరూపదీప మవనిం బడవైచి యహంకృతిద్వారా
వేశవశీకృతుల్ హృదయపీఠములం దిడుకొంద్రు! దూరదూ
రాశల బెళ్కులీను విశ్రుతాశయ మృణ్మయమూర్తులైనగా
నీ, శిశుఖేలనమ్మని హసింతువు! నాజననీ! కృపాఖనీ!

మెఱుగ రొకింత యేని తమ రెయ్యది పల్కుదురో! అహంకరిం
తురు మరి నిన్నుగాదని కనుల్ కన నేర్వని చిన్నిపాప! లి
య్యరయమి సైచి, నిర్భర దయారసవాహినిగా చెలంగ నీ
మెరుక నిరంతరమ్ము కరుణింతువు! శాంతనిశాంతమూర్తివై!

కవితాదేహళిపై శిరంబిడి నిరీక్షాబ్రాణముల్ సల్పి, రే
బవళుల్ నిన్నెదలో స్మరింతుమరి సివా! దూరదూర జ్వాల
న్నవతారాప్రభవై స్ఫురించెద విక్షాబ్రాతర్వ్యాలస్పందవా
తవిలోలప్రసవమ్ము జారిపడుగాదా! శీర్ణపర్ణస్థలీ!

బంగరుతల్లి! మాయెదలపాలిటి చల్లనికల్పవల్లి! నీ
రంగదపాంగరక్తిమ పరాఙ్ముఖమైన మహేశుడుం జలిం
పంగ నశక్తుడందురు! కృపాతరళాచ్ఛతటిన్మనోజ్ఞ దృ
ష్టిం గృహదేవతా! మెరయజేయుము! రాజత రంగవల్లికల్!

సంశయవెల్గులే కరగి జాల్గానులీల మహేంద్రకార్ముకా
రంజితమై స్వనించె మధురశ్రుతి నౌకపరంజియేరు! త
న్మంజులవీచికావళి నమందముదమ్మున హంస లాడె! దే
లెం జలరత్నమీనతరళీకృతముల్ విశదేందు చంద్రికల్!

రాజతనౌకపై స్మితవిరాజితవైస్ఫురియింప, కాంతినీ
రాజితవాహినీచలతరంగము లెల్లెడ కేలుమోడ్చి, నీ
కై జయవెట్టె! యొక్కగళమై యలలే నుతియింప దారకా
రాజిలసత్కిరీటశిఖరమ్ముల రెన్నెలవంక వెల్గులన్!

కోటికిరీటతారకలకుం బ్రతిబింబము లెల్ల జాళువా
నీట జెలంగి యూడ, దటినీజలరాజతనౌక వీణపై
మీటుగతిం దరంగతతి మెల్లగ దాటి తటమ్ము జేర, నీ
స్ఫాటికరేఖ హర్షవివశమ్మయి సోలె సమస్తవిశ్వమున్!

ఆ మహనీయ దర్శనమహమ్మున గన్గవ బాష్పపూర మే
రై మరిమాటలేక శిలనై యటులే నిలుచుంటి, నంత నా
కా మిహికాంశు మోహన ముఖమ్మెదురై, కలధౌతవాహినీ
సోమసహస్రమై వెలుగుజూమ్ముల నన్నలరించె నెమ్మమై!

నిను దలపోయునంతన కనీనికలం దరళాశ్రు వల్లన
ల్లన దిగజారి, కన్గొలుకులం బ్రవహించి, మహేంద్రచాపమో
హానతర వార్షనీలఘనమై బరువైన యెడంద రమ్యన
ర్తనకవితావిచిత్రజలధారల నుర్వుల బర్వులెత్తెడిన్ !

గుండెలలోన నే దమృతకుంభము లల్లన పొంగి వెల్లువై
నిండినలీల దోచెను ! కనీనికలం దపనీయపాదుకా
మండితబాష్పహీరమణిమాలలు జారెను ! నీతలంపునం
బండిన దీ కవిత్వము! విపాండుర ద్రాక్షగుళుచ్ఛహృద్యమై!

ఆకస మంటు సౌధనివహమ్ము! మహానగరమ్మహో! జనా
నీకసమాకులమ్ము ! ధరణిం గల భోగ్యము లెల్ల బణ్యర
మ్యాకృతులై వెలింగి హృదయమ్ములు గోర్కెల దివ్వెలెత్తె! గా
నీ ! కనిపించె నా కనలమే జ్వలియించి దహించులీలగన్ !

బాట గనుంగొనం గ్రమ నిబద్ధము సర్వము! వీథుల న్నిరా
ఘాటగతిం జనెం బహుముఖమ్ముల వాహనపాళి ! గాని, యి
వ్వాట జన మ్మరణ్య పదవిం బడిపోయెడు తీరు దోచి, యా
రాట మెదం గలంచె! నిదురన్ నడయాడెద రెందుబోదునో!

ఏయొక గమ్యమో యెరుగకే పయనింతురు! వన్నె చిన్నె గో
ల్పోయిన జీర్ణపర్ణతతి పోకడలన్ బెనుగాలిదేలి! యే
మై యెటు లేగిరో! యని భయమ్మొదవెన్! గనువెల్గు లారె! దా
మై యిది బాట కాదని యొకింతట గన్గొన నేరరే కదా!

పరువిడిపోదు రౌర! పురపాంథు లదేగతి! శీఘ్రవాహన
త్వరిత గతిం గటా! తమ పథమ్మదియో గురుతింపలేరు! భీ
కరమరణాగ్ని ఘంటిక లఖండరవమ్ముగ మ్రోగసాగె! నో
పరమశరణ్య! సాదరకృపం దరిజేర్పగదే! విపన్నులన్!

మృత్యుపదాహతిం బ్రతినిమేషభయార్తి గృశింతు రంతె కా
నీ! త్యజియింపనేరరు! దరించిన కాంచశృంఖలాళి! ఓ
నిత్యకృపాళుమూర్తి! కరుణింపుము వీరిని! నీవెగాక దా
గ్గత్యపథమ్మునం జనపరంపర కింక శరణ్య మున్నదే!

భీషణభీషణమ్ము, భయభీతికరమ్ము, కరాళదంష్ట్రికా
రోషవిలోలజిహ్వా, మతిరూక్షనిటాలచలేక్షణమ్ము, ని
ష్పేషితదైత్యదానవ, మసిప్రచల మ్మిక నీస్వరూప ము
న్మేషితసత్కృపాజలదమేచకలీల శరణ్య మయ్యెడున్!

నా జనయిత్రిసన్నిధి యనారతశాంతినిధాన మాత్మనీ
రాజన మెత్తి యానతశిరమ్ముల ధన్యత నంద రండు! రం
డో! జనులార! రండని మహోత్సుకతం గళమెత్తి పిల్తు నం
తే! జననీ! యొకింత విన రెవ్వరు నవ్వుచు బోదు రెల్లరున్!

ఎరుగమి జేసి యేదో! పలవించెద నీగతి నింతియే! పర
స్పరవిభిన్నమార్గశతపద్ధతులం దరళమ్ములై భవ
చ్చరణములే స్ఫురించె! ననిశమ్మిక నీ బహుచిత్రమార్గమం
ధర పదలాస్య దర్శనముదమ్మున నెమ్మన మాడు నెమ్మినై!

మానవమేధ రేణుపరిమాణము! కుమ్మరిసారెవోలె నా
త్మానుగతిం బరిభ్రమితమై యొకచింతన సేయనేర్చు నిం
తే! నిజతత్త్వబోధసరణిం జన నేర దొకింత! యింక తా
నై నినుగాంచెనా! మరి యనంత మహోమయసాగరమ్మగున్!

పదయుగళాంక ముద్ర యెదపై గదియించుట జేసి, యంశా
స్పద మయి వెల్గె నా కవనభావన సర్వము దేవి! ఇంత యా
భ్యుదయము కల్గెనే యని సముల్లసితమ్మయి సాగు నింక నా
బ్రదు కొక ఆటగా! సరళవైఖరి బల్కిన మాట పాటగా!

నను దరిజేర్చుకొన్న తరుణమ్మున నే జనయిత్రి వైతి! నం
దను డోడిలేక మాతయగు వా! యిటు లీ విడరాని గాఢ బం
ధన మిది నిన్నె జుట్టిన దనారతమై! మరి నీకె ముక్తి లే
దని తెలిసెన్ సరే! అహరహమ్ము యథేచ్ఛగ నాడుకొందు లే!

ముక్తి వరింతు రెల్లరు విమోహితులై! జగతీ కుటుంబ సం
సక్తవు నీవె చిక్కితివి సంసృతిబంధములన్ ! విచిత్ర మీ
ప్రాక్తనరక్తబాంధవ మపారకృపా! మము గన్నతల్లి! నీ
రక్తియె తోచె నాకు నిదురం జిరుపాపనిబోసినవ్వులో !

ఏయెడనైన దీనగళహీనత నొక్కతె బిచ్చకత్తె య
మ్మా! యని పిల్చి జాలిబడునంతకు నీకును మాకునైన నిం
తే యిలపై విముక్తి లభియింపదు! సాగెను నీవిచిత్రలీ
లాయతలాస్యకేళి జనతాంతరభక్తిలయానుబద్ధమై!

ఎంత దృఢమ్ముగా నొగి బిగించితి వీ గళశృంఖలల్ మన
శ్శాంతి నశించె నీ పరిహాసన్నిగళమ్ముల నంచు నెంచె నా
స్వాంత మొకింతయే నెరుగజాలక! కాని, దరస్మితమ్ము ర
వ్వంత వెలింగినంత మణిహారములే గురుతించి నవ్వితిన్ !

ఒక తెలిదమ్మి సూర్య కిరణోల్లసిత మ్మయి విచ్చినంత, నీ
వికసితశుభ్రమూర్తి కనువిందుగ నేగనుగొంటి నారి! ఊ
రక సముదగ్రహేతుశిఖరమ్ముల దాత్రి వికసాధనిర్మితి
ప్రకటితగర్వమత్తిలు చిరమ్మటు లే భ్రమియింతు రేలకో !

తారాహీరలసత్కిరీటము జగద్ధాత్రీ! భవన్మందిర
స్మేరోదాత్త హిరణ్యగోపురము! నెమ్మిం దత్ప్రభా రేఖ వి
స్ఫారేక్షం దిలకించినంత నెడదం భంగంబులై పొంగి నిం
డారెం దుగ్ధమహాబ్ధి! కన్నుగవ వెంటం జారె హర్షాశ్రువుల్!

కేలం జోలె ఘటించి నీ భవనసంగీతోర్మికామాధురీ
లోలత్వమ్మున జేసి కన్నుగవ లోలో భాష్పముల్ చెక్కులన్
జాలై జార ద్రవింతుగాని మరి వీసమ్మంత నాకోర్కె నీ
మ్రోలం దెల్పగ నేరకే గళితసమ్మోహమ్మునన్ నిల్చితిన్

నీసముఖాన నించుక మనీషిత లేశము తోచినంత నెం
తే సగమై కృశించిన మనీషిని నన్నిటులింత దూర ని
ర్వాసితు జేసి మత్తధనవన్నికటమ్మున దైన్యవృత్తిమై
గాసిలజేయ నేల! హృదగాధవిషాబ్ధిపరిస్ఫుర న్మణీ !

సవిధనిధిం గణింపక దెసల్ పరికించినవివి జేరి, నీ
ప్రవిమల పాద సన్నిధి కృపందయ సేయుట కేగదా ! సదా
వివిధపథమ్ములం వికటవేషములన్ నటియింపజేసినా
వపుర! విచిత్రమే! యని నిరంతరవిస్మయరేఖ నిల్చితిన్ !

అనునిమిషమ్ము నద్భుతమహాకవయిత్రివి నీవు! నిత్యనూ
తనగతి సాగిపోవు బహుధా భవదీయవిచిత్రసృష్టి ! యే
మని పదపీఠిమోల కవినై నిలుతున్! తమియింతువన్న భా
వన యొక టే కవిత్వ పరిపాటికి నా కవలంబన మ్మెడన్ !

ఒరు లెవరైన యీాకృతి ఒహో! యని మెచ్చినయంత నీసమా
దరణ మిదే ఫలించె గవితామయమై యని యెంతుగాని, యం
తరగతి నీతలంపును వృథా దురహంకృతిగా స్ఫురించి, యె
త్తెరగుననైన నేరని మతిప్రపశమమ్మున మాన మూానుదున్!

ఇది యెటులో శ్రమంపడి గ్రహించితి నీవననాంతమన్న నె
మ్మది నొకటే భయమ్మగుసుమా! పలురంగులబొమ్మ లిన్నిక
న్నెదుట నొసంగి మెల్ల గికురించెద వీవని! మాటిమాటికీ
బ్రదు కిటులే కలంగెను! తిరమ్మయి నీ యవలంబ మందినన్!

చదువుల్ సంధ్యలోకింత లేక చెడి దుస్సాంగత్యముల్ సేసి న
న్మదిగీలించిన యల్లులైన సుతులే మాతృప్రభూతాదరా
స్పదులై మించెదరంచః రమ్మోయి శతాంశమ్మైన నా తల్లి! నీ
హృదయమ్మింతకరంగునన్న మతిగాంచింతున్ యథేచ్ఛా
గతుల్!

యౌవనశుక్తి మౌక్తికములై వలపుల్ విలసిల్లునంతలో
నే వికలమ్ములై చెడి నశించును! కన్నగవంగవోష్ణ బా
ష్పావళి నింపకే వకుళమైనను రాలని యీహతావనీ
జీవనశూన్యవాటి వికసించెను నీ హసితమ్ము దీపమై!

పోవును నీడలై! మొద నపూర్వసుహృద్వర సౌహృదమ్ము ల
య్యో! వికసించునంత నె వియోగవిలూనములై నశించు నే
లో! వలపుంబువుల్! నిలువ దొక్కటి యక్కట! దిక్కుచూపి, నీ
వే వెనువెంట నిల్చి, నడిపింతువు జీవిత నిత్యపాంథులన్!

కోరికదారులం దరుణకోరకిత ప్రియ తాగతిందినాం
తారుణశోకపూర్ణహృదయాపగవై యరుదెంచి, తారకా
తోరణమాలికాంచితమృదుశ్లథనీలనిశావగుంఠన
స్మేరముఖాన మెల్లవికసింతువు లోకహృదబ్జకర్ణికన్!

ననుగని యెందరో యడిగినా రిది-'నీ జనయిత్రి యెవ్వరో
కనుఁగొన నేర్తుమే'యని మొగమ్ముల నవ్వుదొలంక, నంత నే
'ఘనజనతాపునీత నను గన్నదిదే, సువిశాలధారుణీ
జనని! యెరుంగరే!' యని నొనల్ ధర జేర్చి మెల్ల మ్రొక్కితిన్!

పరమకవీంద్రులై! యమరవాగ్గరిమాగురుదేవులై! నుతిం
చిరి! బహుశిల్ప వైభవ విశేషములన్ నిను బూర్వు,లంత చా
తురి మెరయింపలేక, గనుదోయి బొరింబొరి బాష్పపూరముల్
దొరయఁగ నిల్చి, నాకయితదోయిట గూర్చితి నెమ్మిదమ్మియే!

చిరబహుమార్గఖిన్నులగు జీవితపాంథజనమ్ములార! భీ
కరవిజనాంధతామసీ ముఖమ్మున గార్తికదీపలీల మీ
కొరకయి నిల్చినాడ నిదిగో! మణిదీపిక! మెల్లనం బ్రభా
తరళపథమ్మునం జని ముదమ్మున జేరుడు! భవ్యగమ్యముల్!

మ్రోయఁగరాని తీవ్రభరమోహితులై యడుగేని సాగగా
నీయని దుఃఖతప్తసరణిం బడి మ్రగ్గెడు సార్థవాహులా
రా! యిదె! రత్నకుంభతరళామృతమై దిగివచ్చె నంబ మీ
కై యిలపై కనుంగొను డహర్ముఖదివ్యదరస్మితమ్మదే!

# రత్నోపహారము

[ ఖండికా గీతికా సంపుటి ]

శ్రీ గణపతిశాస్త్రి

నవ్య సాహిత్య పరిషత్తు

△ గుంటూరు △

# శ్రీ చింతా దీక్షితులుగారికి

సమర్పితము



ప్రథమ ముద్రణము ఏప్రిల్ ౧౯౪౭
నలందా ప్రెస్ తెనాలి

# పరిచయం

'తృణకంకణము'తో ప్రారంభమైన నవ్యాంధ్రకవితా ప్రవంతి అవిచ్ఛిన్నంగా ప్రవహిస్తూ ఉన్నదనడానికి, శ్రీగణపతిశాస్త్రిగారికృతులే ప్రబల నిదర్శనాలు. సున్నితమైన హృదయమూ, సుందరములైన భావాలూ, 'శిరీష కుసుమపేశల'మైన శబ్దజాలమూ, వీరి కవితాసామగ్రి. పండితులకాని పాండిత్యాన్ని అధిగమించి భావవీధిలో సంచారంచేసే అలవాటు. కొన్ని సంవత్సరాలనుంచీ 'భారతి' 'ఉదయిని'వంటి పత్రికలలో వీరి ఖండకావ్యాలు చదవడమేకాక, స్వయంగా తను మధుర ధ్వనితో చదివి వినిపించగా వినే అవకాశం నాకు లభించింది. ౧౯౫౭ ఫిబ్రవరిలో బందరు ఆంధ్ర జాతీయ కళాశాలలో సమావేశమైన నవ్యసాహిత్య పరిషత్తులో వీరు తమ 'జనార్దనరాయసంస్మృతి' చదివినారు. సభలో ఉన్నకొన్నాను మనస్సు నీరైపోయింది.

'హృదయము విప్పికోనిక మరవ్వరు
నాకిట జీవితమ్ములో' అనీ,
'వాఙ్మయ యజ్ఞవేదిక నాహుతి
యయిపోయినారొకో' అనీ

విలపించినప్పుడు, "'ఉదయిని' సంపాదకులైన మా జనార్దనరావు స్మృతే, ఈ కవికీ నాకూ స్నేహబంధం కాగలద"ని ఆశపడినాను. నా ఆశ ఫలించింది. ఈ కావ్యసంపుటికి పరిచయవాక్యం వ్రాయడమే ఇందుకు నిదర్శనం. క్రిందటి సంవత్సరమే ప్రకటింపవలసిన ఈ గ్రంథం, నేను చెరసాలలో సంవత్సరం గడిపి వచ్చేవరకూ నా పరిచయ వాక్యానికై ఎదురు చూడడమే నాకొక వింత ఆనందాన్ని సమకూర్చింది.

ప్రకృతిలోనూ, మానవజీవితంలోనూ నిత్యమూ సంభవించే సన్నివేశాలను కేవలం స్థూలదృష్టితోనే పరిశీలించి, వాటి బాహ్యస్వరూపాన్నే వర్ణించడం శాస్త్రపరిచయ మవుతుంది. వీటికి నే అపూర్వమైన, అతీంద్రియమైన రసప్రపంచంలోని దివ్యశకలములని గుర్తెరిగి అందలి పరమ సత్యమును సందర్శించి

రసాత్మకమైన కావ్యమును సృష్టించడం కవిత్వమవుతుంది. శాస్త్రానికీ, కవిత్వానికీ ఉండే ఈ అంతరమును గమనింపక, ఛందోబద్ధమైన వ్రాత అంతా కవిత్వమే అనుకోవడం పొరపాటు. రసావేశస్థితిలో కవులకు అనుభూతములైన ఘట్టములే ఉత్తమ కావ్యరచనకు దారితీసినవి. 'ఖండకావ్య'మనీ 'భావగీత'మనీ నవ్యాంధ్రకవులు రచించేవాటిలో, విశేషంగా, కవి స్వీయానుభవాన్నే చిత్రిస్తాడు. ఆ అనుభవం ఒకానొక సందర్భంలో అతనికి మాత్రమే కలిగినా, అతని కృతి మనము పఠించినప్పుడు, "ఈ అనుభవము అనేక మందికి రావచ్చును. నాకు కూడా వచ్చినట్లే జ్ఞాపకం. కాని. ఇంతస్పష్టంగా, ఇంతరసవంతంగా నేను దానిని వర్ణించలేక పోయినాను, ఈ కవివ్రాసిన గీతం చదివితే, సరిగా అప్పటి అనుభవమే, ఇనుమడించిన ఉద్వేగంతో, మరల పొందుతున్నాను" అనుకోవచ్చును. అందరి హృదయ కుహరాలలోనూ నిద్రాణమైఉన్న భావ పరంపరను ఈ విధంగా ఉత్తేజింప చేయడమే కావ్యసృష్టిలోని మహత్తు. కవి అనుభవమూ శ్రోతల అనుభవమూ, పర్యవసానంలో ఏకమై పోతున్నది. అట్టి ఐక్యత లేనప్పుడు రసస్ఫూర్తి కలుగదు. అనగా, పాఠకులలో నే అంతరములుండుటవల్ల, ఒకరికి కలిగిన ఆనందం ఇంకొకరికి కలుగదు. అందువల్లనే 'భావకవిత్వంలోని భావము ప్రబంధకవిత్వంవలె అర్థముకా'దన్న నింద వచ్చింది. అంతమాత్రంచేత దీని ప్రయోజనం పరిమితమని ఉత్తమకావ్యశ్రేణిలో దీనికి స్థానములేదనీ, అపోహ పడనక్కరలేదు. నవ్యాంధ్రకవులు మన సారస్వతంలో భావగీతమునకు గౌరవమైన పదవి కల్పించినారు. అందుకే మనకు వంద్యులు.

"ఏలనోరి సముద్రయాన
మెంతకాల మన్వేషణ!
పోయినమణి మరిదొరకున!
ఈయగాధ సాగరమున!"

అన్నారు శాస్త్రిగారు. మనోరథం విఫలంకాగా నిరాశ హృదయాన్ని సంపూర్ణంగా ఆవరించగా, జీవితమనే 'ఈయగాధ సాగరమున'

పోయిన మణికోసం వెదకడమే నిరర్థకమనిపిస్తుంది. మనస్సులోని ఆవేదనను ఎంతచిత్రంగా, ఎంతరసోద్దీపకంగా వర్ణించారో చూడండి. దాదాపు ఇటు వంటి సన్నివేశమునే ఆధారం చేసుకుని శ్రీ కృష్ణశాస్త్రిగారు

"ఆకులో ఆకునై, పూవులో పూవునై
ఈ యడవిదాగిపోనా,
ఇచటనే ఆగిపోనా,"

అని తమ విషాదములను వెలిబుచ్చినారు. కాని ఈ కష్టానికి అంతు చూదామనే పట్టుదల ఒక్కొక్కప్పుడు ఈ విషాద గీతికలలోనే స్ఫురిస్తూ ఉంటుంది. మొండిధైర్యంతో.

"సాగింతు నీప్రేమ సాగరయాత్ర"

అని శ్రీ వేదుల సత్యనారాయణశాస్త్రిగారన్నారు.

"ఏడుపు కవిత్వం చాలావిన్నాము. కొంచెము వెలుతురెక్కడైనా ఉన్నదా!" అని కొంతిమంది అంటారు. వారు ఈనాటి కవులు వ్రాసిన ఆనందమయ ఘట్టములు పరిశీలించకపోవడం వల్లనే ఈ విధమైన ప్రశ్న వేస్తున్నారు. గణపతిశాస్త్రిగారే

"ఈ నవయౌవన వనిలో
ఏయామరులు పూయించిరో!
పావనమందారకలిక!
జీవనపద్మమణి దీపిక!"

అని ప్రేమసుమమునగూర్చి సంతోషం వెల్లివిరిసేటట్లు పాడినారు. అంతేకాదు;

"మరల తరళ నవవసంత
మరుగుదెంచె తరులనోహో!
అరుణారుణ కిసలయముల
చరణాంగుళి విలసనముల!"

అంటూ, నవవసంతాన్ని ఆహ్వానించారు.

"మధుపూర్ణమా నీ
సువర్ణపాత్రము విడిచి
రాజాలనో ప్రభూ !
రాజాల నిపుడేను
ఈ సుందర ప్రపంచము విడువగా లేను !"

అని జీవితములోని మాధుర్యాన్ని, ఆనందాన్ని చవిమాడవలెననే గాఢమైన కోర్కెను కీర్తించినారు. వీరి దృష్టిలో మృత్యువుకూడా అందమైనదే. అదిచక్కని నౌక.

"తరుగని యీ జలనిధిలో
ఎరుగని ఏ సుఖతీరము
చేర్చునో నీ చిత్రనౌక
... ... ...
ఏ జీవన చిత్రగాథ
వినుల నా సాంధ్యవేళ !
వివరింతువో ! మురళిలీల !"

పిచ్చుకలు, ఉడతలు, గోవత్సములు, పసిపిల్లలు శ్రీ గణపతి శాస్త్రి గారికి ఎక్కువ సంతోషాన్ని కలిగించేటట్లు వారిగీతాలవల్ల తెలుసుకోవచ్చును. ముఖ్యంగా పిచ్చుకలను తనుపాపాయిలోవచ్చి ఆడుకోమని కోరుతారు. శకుంతలకూ శకుంతలాలకూ ఉన్న బాంధవ్యమే వీరికీ పిచ్చుకలకూ ఉన్నదేమో ! అమాయికత్వమూ, నైర్మల్యమూ, శాస్త్రిగారిలో మూర్తీభవించినవి.

ప్రబంధకవిత్వంలో మనకుబాగా పరిచితమైన వృత్తాలను శాస్త్రిగారు తృణీకరించలేదు. "శ్రీజనార్దనరాయసంస్మృతి" "శ్రీరామారాయసంస్మృతి" 'శ్రీరామమూర్తిసంస్మృతి' రచించడములో వృత్తాలనే పూర్తిగా వాడినారు. ఇవి సుప్రసిద్ధ కావ్యాలలోని వృత్తాలకు తీసిపోవు. కాని, శాస్త్రిగారికి

వినూతనమైన ఛందః కల్పనలమీదా, గేయాలమీదా, అభిమానం ఎక్కువ. వీనిలో కొన్ని కొత్త ప్రయత్నములు. ఇట్టి రచనలో వీరు కృతకృత్యులైనారు. మార్గదర్శకులు కూడా.

కవిని కాకుండా, కేవలం 'కవిమిత్రుడ'నైన నేను ఇంతకంటె విపులమైన పరిచయవాక్యం వ్రాయనక్కరలేదు. కవులే ప్రపంచానికి శాసనకర్తలని 'షెల్లీ' కవి అన్నాడు. కాబట్టి రాజకీయాలలో శాసనకర్తలమైన మాకన్న శ్రీ శాస్త్రిగారివంటి కవిపుంగవులే ఆంధ్రజాతి ఔన్నత్యానికి కారణభూతులు. పిన్నవయస్సులోనే ఇంతస్వచ్ఛమైన కవితాధారను వర్షింపగల వీరు అచిరకాలంలోనే శ్రీ రాయప్రోలు సుబ్బారావు, శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి ప్రభృతుల శ్రేణిలో సుస్థిరమైన స్థానమును పొందుతారని విశ్వసిస్తున్నాను.

కవుల జీవితాలు కష్టమయమైనవి. తారాపథంలో సంచరించినా, ఎప్పటికప్పుడు

"మరల నిటులే మనలవలెగద
బరువు మోయుచునే"

కాని, వీరిధైర్యం మాత్రం అమోఘమైనది;

"పాటలే మన బరువు మోయుగ
పడవలాగెదము,"

జీవితపు బరువునంతా అవలీలగా మోయుగల శక్తి వీరిపాటలలో ఉన్నది.

వీరు కవులే కాదు; సాధకులు. ఉత్తమ కవులంతా సాధకులే.

కోలవెన్ను రామకోటీశ్వరరావు
'త్రివేణి' సంపాదకులు

# అనుక్రమ

# మాతృభాగ్యము

ఎన్నెన్ని పుణ్యాలు చేసినావో !
ఎన్నెన్ని నోముల్లు నోచినావో !

బిందె బుజమునబెట్టి కాలవకు పోతూంటె
చీరపట్టుకు కాళ్లకడ్డపడు పాపణ్ణి
ఎత్తుకొని పాలిచ్చి ముద్దులాడే నీవు ! ఎన్నెన్ని

పాపాయి కన్నేది చూపించమంటేను,
నడిమివేలితో ముక్కు చూపించు పాపణ్ణి
ఎత్తుకొని ముద్దిచ్చి ఎగురవేసే నీవు ! ఎన్నెన్ని

నాన్నవచ్చి పాపనెత్తుకొంటానంటె,
రాను రానని నీదు మెడ కౌగిలించేటి
ఈ చిన్ని పాపణ్ణి ఎగరేయడానికీ ! ఎన్నెన్ని

కష్టపడి తెచ్చినా కాలవలో నీళ్లన్ని
పారబోసీపాప బందచేస్తూ ఉంటె
ఏమిరా ! బండంటె వెర్రినవ్వులు నవ్వు
దొంగదొరికాడంటె చిట్టినవ్వులు నవ్వు
ఈ చిన్నిపాపణ్ణి ఎత్తుకోడానికీ !
ఈ చిన్ని పాపణ్ణి ఎగరేయడానికీ ! ఎన్నెన్ని



# కలవరింతలు

వెడలిపోకోయి మురళీ!
నన్నిటుల
విడిచిపోకోయి మురళీ!
అలసి యీ వనములో
నిదురపోయితి నేను!

ఆ గాఢనిద్రలో నీమురళి వినిపించె!
దూరాన దశదిశల దావాగ్ని వెలిగించు!
కారుమబ్బులు క్రమ్ము గగనాంతములలోన!
ఈ కారుచీకటిని ఈ భీకరాటవిని
నిదురించుచుండగా ననువిడిచి చనినావ!
ఆకులల్లాడంగ నదరిపడి చూచితిని!
మురళివచ్చెనటంచు మురిసిపడిపోయితిని!
కోయిలపాటలో! క్రొమ్మావి చిగురులో
నీపాటె వినిపించు! నీరూపె కనిపించు
మెరుపు తళతళలలో ఏటి గలగలలలో
నీతళుకె కనిపించు! నీపాటె వినిపించు!
వెడలిపోకోయి మురళీ!
నన్నిటుల విడిచిపోకోయి మురళీ!



# రాజాలను

రాజాలనో ప్రభూ! రాజాల నిపుడేను!
ఈ సుందర ప్రపంచము విడువగా లేను!

మల్లికాముకుళసిత
శూలాగ్ర శూచికలు!
కేతకీ కుసుమవిష
మాంచల క్రకచములు
గ్రుచ్చుకొన్నవి ప్రభూ!
గాటముగ నాహృదిని
కదలివచ్చుచునుండ
కరకుమనుచున్నయవి!

రాజాలనో ప్రభూ! రాజాలనిపుడేను!
ఈ సుందర ప్రపంచము విడువగా లేను!

వేధింపకుము నన్ను
విసిగింపకుము నన్ను
ఏ నెసంగుదు నెవ్వ
నీ నఖాగ్రము సోక
నిదుర గన్నెడువ
నిదురింతు శాంతమ
కొలని చిరుతరగాల

గలసి నృత్యముసల్పు
నును దామరాకులో
దెలినీటి ముత్తెమటు
లీ యఖాతానంత
కాలంపు సరసిలో
జారిపోయెద నెప్డో
కరగిపోయెద నెప్డో

కాని నీతోడ నే రాజాల నో ప్రభూ
మాటి మాటికి నన్ను మరలి గ[illegible]నకింక

మధురమవు కలవోలె
మాయమయ్యెదవేల ?
వెడలి పోయెదుగాని
వినుము నా దొకమాట!
నవ్వు వెన్నెలలీను
హరిత మల్లీసఖుల
అరుణ మధురాధరల
మందార తరుణులను....
ధవళ తారల నవ్వు
మాధవీ బాలలను
అది [illegible] ననవేల
సకల ప్రపంచమ్ము

హృదయమ్ము మత్తిల్లు
నటు సృజించితి వేల ?
ఆకొన్న భిక్షుకుని
కమృత పాత్రమునిచ్చి
త్రావబోవు చునుండ
దన్ని వేసెడు మాడ్కి
రమ్ము రమ్మని నన్ను
వేగిరించెద వేల !
మధుపూర్ణ మేనీ సు
వర్ణపాత్రము విడిచి !
రాజాలనో ప్రభూ !
రాజాల నిపుడేను

ఈసుందర ప్రపంచము విడువగా లేను !



# విభ్రాంతి

బాల యీచాయనే పరతెంచె గాబోలు!

పసిరి కసవు తివాసిపై ముత్తెముల జల్లి!
జాబిల్లి కపురంపు రజము వెల్లెడజల్లె!
పాలవెన్నెల ప్రస్ఫురించు నచ్చరచాన!
రజతపాత్రిక వంచి రిచ్చవడియటు జూచు!
గొర్రియల మందవలె తెలిమబ్బు తునుకలవె!
కొండపై శయనించియుండి యట్టులెజూచు!
వట యువకుడడుగు సవ్వడి హృదయమున మ్రోయ
కనుమూసెనో యేమొ నిశ్చలత వహియించె!
కొమ్మ మృదుచేలమ్ము కొస విసరెగాబోలు!
మల్లికాసుమము లిట పుత్తిల్లి పడియుండె!
ప్రేమయాకర్షింప బరువిడెనో ప్రియునికై
కజ్జల వినీల సహకార తరువుక్రీనీడ
మృదు చంద్రకాకుంద మాలికలు పడిమెరయు!
చలదృగంచలములన్ బెదరు హృదయమ్ముతో
అడుగులవె తడబడగ నలుగడల జూచెనో
క్రీగంటి క్రొమ్మెరుగు కణముమిణుగురుపురువు!
తళుకుమని తాకసినె పులకింపగా జేయు!
తరురాజితరుణి తొందరగ బోవగబోలు!
బాలయీచాయనే పరతెంచెగాబోలు!



# ప్రేమ మాట

ఎన్నియుగములమాట ! ఏనాటి మాట
ఈనాటిదా తరుణి యీప్రేమమాట !
కల వసంతాల కోకిలలమై మన మిలను
లలన కలకాల మెట కలవరించితిమొ !

ఆకసమె కౌగలిడు అబ్ధితరగల
నింగితారల కనుల పొంగిపొరలే ప్రేమ
ఈనాడు చిందినది యీమృదుల హృదయాల
ఎదలలో తుదివరకు ఇదె పొంగు మనలోన

జల విలయ కాలాన అలల జోడై మనము
నీలాంబరాన తారల తుసుముకొనగలము.
ఎన్నియుగములమాట ఏనాటిమాట !
ఈనాటిదా తరుణి యీప్రేమమాట !



# పడవపాట

పసిరి పచ్చనిచేల మెల్లగ
పండువెన్నెల నిండిపారుచు
కరగిపోసిన వెండివలె నొక
కాల్వ మెరసినది !

నీలతట భూరుహములా ని
శ్చల వినిర్మల నీరములలో
ఆత్మబింబమ్ములను జూచుచు
నటులె నిల్చినవి

తారకలు పూర్వమున మున్గిన
తరళమౌక్తిక రాజులో
వారుణీ నేత్రములో యన వాః
పూరమున వెల్గెన్

నిర్మలాల్ప తరంగములలో
నిదురగొను రాయంచవలె నొక
తేలు తెలివింజామరము వలె
తేజరిలె జాబిల్లియున్.

ఆవలితీరమునుండి మెల్లగ
నలస జలదము జారు నొక కల
వోలె తీరము జేరె తెలి వె
న్నెల మునుంగుచును;

నీరుద్రా వెడు చాపతో, ని
ద్దురజనమ్ముల గుర్రుతో,
నీరమున దాబేటివలె రా
ధారి జారినది

ఆయనంత గభీర నిశ్చల
తా ప్రగాఢ సుషుప్తిలో
తీరతరునీడముల బులుగులు
కలవరించినవి.

నీరనిశ్చల పూరమున నీ
హారబిందు సుమమ్ములున్
తీర తరు పర్ణచ్యుతమ్ములై
హారముల నలెన్

శారదాభ్రమువోలు పెను తెర
చాప సోకిన చెట్లకొమ్మల
పండుటాకులు రాల మీనులు
పల్లటిల్లినవి.

నీలనిద్రా తామసిని తళ
తళను కలలను వెన్నెలే!
కనులుమూయుగ పాటయిది మా
వీనులన్ మ్రోగెన్.

"అడుగు వేయుడు త్రాడులాగుడు
తడబడెద రేలా ?
నీడలే మనతోడుగానీ
పడవలాగెదము"

దూరగమ్యస్థానములకై
శిరసులెత్తగ నేలనో !
మరలనిటులే మరలవలెగద !
బరువు మోయుచునే !

పదిదిశలు చెవియొగ్గివినగా
ప్రతిదినము నిటుపాటబాడుచు
పాటలే మనబరువు మ్రోయగ
పడవలాగెదము"



# అర్ధరాత్రి

తరునికరములముంచి
మెరయుతారల నారసి
జుమ్ముమని చీకటులు
క్రమ్ముకొని ప్రవహించె !

అలసి నిదురించెయే
కలగాంచెనో గాని
యెలమావిదోట కో
కిల కలవరించినది.
కలవరపు తరగములు
దెస లెల్ల బ్రాకినవి !

వడివడిగ బరువెత్తి
విశ్రమించిన గాలి
ఆవులింపగ పండు
టాకు లొక్కొక్కటిగ

చిటపటని రాలినవి
చీకటిని మెరిసినవి.

విసువనక దీపికల వెలిగించి మిణుగురులు
నీలపర్ణములలో నేమియో నెమకినవి
సౌవర్ణసహకార సుమములై మెరసినవి

మెరపువలె తళతళని
మెరయు సర్పమ్మొకటి
పడగెత్తి నాలుకల
చీలికల గదపినది !
జీర్ణపర్ణమ్ములం
జీల్చుకొని ప్రాకినది.

ఊరిలో జాగిలము హోరుమని మొరిగినది
పైనున్న తారకలు కునికిపాటులుపడెను:
లోకమంతయు నిద్రలో మునిగిపోయినది;
కలియొకడె మేలుకొని నిట్టూర్చె నేలనో !



# పాపాయికి

శ్రీ ఉషసి చరణమం

జీరాల విడివడిన
చిన్నిబంగరు గంటలారా
గలగలను
చిట్టిబంగరు పిచుకలారా !
వీథిచూరుల దిగువ
వ్రేలాడు రాజనపు
వరిజాలరులమీద
వాలిపోదురుగాని,
మెరిసేటి చినిచిన్ని
వరివెన్నులే తెచ్చి
మోగేటి బంగారు
చిరుమువ్వలై వచ్చి
పాపచుట్టూ తిరిగి
పలకరించండి.
పాప నోమూ రైన
ఆడించిపొండి !
చిట్టి ఈ వేళేమొ పట్టిందిపోరు
ఉయ్యాల ఊపగా చెయ్యూరుకోదు !



# ఒక ఆనందానుభూతి

ఎగిరిపోతున్నానో తేలిపోతున్నానో
ఏ మహానందలోకాలకో నేను !

ఎన్నోయుగములనుండి
హిమవన్నగమె మోపి !
దేవి ! క్షణమ్ములో దించితివి నీవు !

మొదలంట బొగ్గయిన మోడున్నై నేను !
వేగమ్మె చివురించి వికసించుచున్నాను.
అబ్బబ్బ ఈబాధ నే భరింపగలేను !
కాలిపోయిన హృదాకాశమ్ము కడలంటి
ఆనందసంద్రమే అట్టె పొంగినది.
మునిగిపోతున్నానో మూర్ఛిల్లుచున్నానో !
కరగిపోతున్నానో ! మరణించుచున్నానో !

ఎగిరి....



# వెన్నెల వెలుగులు

రజనీ మనోహార భ్రమమున చంద్రకములో
నీలిచీకటి కొలని తెలి కలువ పూవులో!
పూలలతలిడిన కర్పూర నీరాజనములో

మెరయు వెన్నెల నీడలారా!
పూర్ణిమా
తరళ నయనమ్ములారా!
మీరిట నిరీక్షింతు రెవరికొరకై
మబ్బువలె మిమ్మునే
మూసిముద్దాడిపోనా!

చలపవన జాలాల మిలమిలను ముత్యాల
మీనులై హృదయమున మెరయుహారమ్మువలె

మీరిటులె మెరయువరకున్
రేయెల్ల
మీకొరకె పడియుందునో!



# చిత్రానుభూతి

అది ప్రశాంత గభీర సాయాహ్న వేళ
దూరమున బుసబుసపొంగు దారుణాస్త
రాగ రుధిరోద్రిక్త ఫేన రాజిముందు
తాళముల నల్లజడలెల్ల వేలవైచి !

నిలిచె నైశ్చల్యమున డాకినీలవోలె
అపుడపుడుగ్గాలి గలగల మనుచుబోయె
శీర్ణపర్ణాంతరమ్ముల శిరసుదూర్చి
మెల్లమెల్లగ సొలెడు బొదలుచుండ

తటతటని మ్రోగె దాళపత్రమ్ము చివురు
ఎరుపు బూట్టు లెగిరె తూనీగలెల్ల
దూరదూరాన మెరసెను తారయొకటి
తరుణ కిరణాల నెర్రమందారమువలె

రోమకూపాల జీల్చినాలోన జొచ్చి
హృదయ గుహలోన హోయను నాదమొదవె
ఝుమ్మనుచు బిల్వగీచురవమ్ము మ్రోత
ఏదియో మానసానూహ్య వేదనమ్ము !

హృదయమున మోపినటు దోచె హిమనగమ్మె;
ఎవరో ఆ రక్త గగన బాహువుల వంచి
నన్ను నులుముచు నుసిచేసినారలపుడు
ఏల యీసంజ యటులు దహించెనో కద !

# నీ మూర్తి

నిలువెల్ల రాలు ము
త్యాల జల్లుల వర్షమై
నీమూర్తి—
నృత్యన్మహాఃపుంజ
నీరాజన జ్వాలమై !
వెలుగు ఱెక్కల దెసల
విప్పి యవి విదలింపగా,
దీపికల నాకనుల
పాపలన్ వెలిగింపగా,
నోటమాటయె లేక
ఎద చలనమే లేక
నీ వైపె పరికించెదన్
నిలువెల్ల కుంచుకుని
కూలిపోదున్ !



# ఉపకృతి

అడుగిడగ దళుకుమను
నందియల పిలుపునకు
శిరసుపై దండవలె జుట్టుకొని నీచేయి
చిరుగాజు బిందెపై జిటుకుమని మ్రోయగా
ఏటికీ వొకతెవే ఏగెదవో యేమో

దూరాన తిన్నెలో ధూళితెర యెత్తినది
సుడిగాలిలో కొంగ చుక్కయై కూసినది
చుట్టుకొను మేఘాలలో నీయెడద
చెరగువలె యెటుచెదరునో

దీపాల కనులతో తెల్ల చేతులనెత్తి
దూరాన జప్పటుల జరచినది నావేదో;
జరజగని తెల్లలో జరగినది త్రాచేమొ
ఆవట్టి బిందెకై యెటువాడెనో చేయి
నేనైన మోసి తేనా? పాపమ్మ
సాయమ్ముగా వత్తునా!

వాలు కనులెత్తి నావంక చూచేసరికి—
చిలకవలె ఒకపలుకె పలకరించేసరికె
ఒయ్యారమే ఒలుకనా బాలికా
వరహాలె ఉట్టిపడునా



# తు రా యి కి

కుపిత రుధిరమహార్ణవోగ్ర
క్రూరజిహ్వాచలనమో !
కోటిరక్త పతాకమాలా
కుల కలకలమ్మో
ప్రళయకాల కరాళకాళీ
భయదకేలీ నర్తనమ్మో
ఏ మహాగ్నిజ్వాలయో ఇది
మెరయునిటు నాలో !
నీ పవన నృత్యన్మహోజ్జ్వల
పుష్పదీప జ్వాలలో—!



# ఒక దుఃఖానుభూతి

బ్రతుకెల్ల బల్లుమని తెలవారెనాకు!
పూతలోనే మండిపోయెగద పూవు!

లోతులానని కొండలోయలో ముందు
గాఢాంధకారాల సుడులు తిరుగుటచూచి,
ఊడిపడి కనుగ్రుడ్లు పడిపోవునటుదోచి
చూడ వణికే కనుల వడి మూసినాను!

గడచిపోయిన దారిపొడుగు నీడల దలచి
కూలి తలపై పెరుగు కొండశిఖరము చూచి
ముందు అడుగిడ లేక క్రింద దిగిరా లేక
కూలబడి పాపనలె విలపించినాను

కోటిజిహ్వాలుచూచి క్రూరాహినలె నేడు
కస్సుమని కార్చిచ్చు బుసకొట్టు నలుగడల!
సగసగము తగులబడ సర్వాంగములతోడ
పొగలెగయు కనులతో పగులు హృదయమ్ముతో
ఎటువచ్చిపడితినో ఈ ఘోర నరకాన
వెనుదిరిగి పోలేను కనుదెరిచి కనలేను
బ్రతుకెల్ల బల్లుమని తెలవారెనాకు!



## దివ్యజ్యోతికి

నను వీడి పోకు దేవీ,
నిమిషమే
నిలిచిపొమ్మిచట దేవీ !
రవులుకొను నీ సాంధ్యరాగాల బరికింప
మది గ్రమ్ము భయమొ నిద్దురయొ మోహమ్మో !
మదధూళి యెగజిమ్మి క్రమ్ము సుడిగాలివై
నను వీడి పోకు దేవీ,
నిమిషమే
నిలిచిపొమ్మిచట దేవీ,
నిదురయే లేని నా నయనమందారాల
గదలు మెల్లనినీలి నిదుర తెమ్మెర నీవు
నీ మహాజ్యోతినే నిఖిలతారలు వెలుగు !
నీవు ననువీడిపో నివి బొగ్గులైపోవు
నను వీడి పోకు దేవీ,
నిమిషమే
నిలిచిపొమ్మిచట దేవీ !
హృదయనాళాలనీ పాదాల బంధించి
పదధూళిలో బొరలి బ్రతిమాలుకోలేను !

మేనెల్ల వివశమై కనులు మసకలు గ్రమ్మ
పట్టువిడి నేనెందో భయదాంధ కారాన
వడిరాలు తారవలె పడిపోవు చున్నాను!
నను వీడి పోకు దేవీ,
నిమిషమే
నిలిచిపొమ్మిచట దేవీ!

వడివడిగ మది నేడు సుడిగుండమైతిరుగు
జగమెల్ల నాకేమొ పొగగ్రమ్మినటుదోచు
దూరాన బాటపై నరుగుజను లొక్కొకరు
కదలిచను కాగడాలై కనిపింతురెవో బొమ్మలై
నను వీడి పోకు దేవీ,
నిమిషమే
నిలిచిపొమ్మిచట దేవీ!



# ఆనందమూర్తి

మీ మధురహాస లేశోదయామృతమున
తోచె నానందవిస్మృతాత్మునకు నాకు
నే మహారాజరాజాధిరాణ్మహోజ్వా
హైమమకుటమణి ప్రభాధామమునని
చిర చిరంతన యుగ పరంపరలనుండి
ఏ యమృతధామములు తపియించెనోగద !
నన్ను సృజియించుకొనె మహానందమూర్తి
భువనమిది దేవి ! ధన్యతాపూర్ణమింక !
ఈ మహానంద సుముహూర్తమేగెననుడు
మీ స్మరణసాగరామృతోర్మికల నెన్న
డేని బిందుత్వమేని వహించు కాంక్ష !
మరణమేని శుభస్వయంవరణమిపుడు !



# నవ్యవసంతా !

నవ్యవసంతా ! దివ్యవసంతా !
వత్తువా నాయౌవన వనికై

దూరదూరమున నీరథ నినదమె
తాళాంచలముల గలగల మ్రోయగ
ధూళీబాలలె చల్లిరి నీకయి
గళితపర్ణ నవకాంచ నాక్షతలు !
నవ్యవసంతా !

ఇన్నాళ్లకు నీవిటువత్తువనన్
భగ్నమండిన బ్రదుకు టెడారి నె
కాలినకాంక్షల ధూళులెగయు నెవో !
రాలు నమృత వర్షాబిందువులెవో !
నవ్యవసంతా !

కోయను కోయిల నిదుర వలలనే
వాయు కపోతిక లలసి నిదురగొను
మ్రాగనువెట్టి మర్రి నీడలనె
ఉడుతల బుడుతల అడుగులు పడలెను!
నేనే మ్రోడయి నిలిచితి నీకై
నీరధ నేమి రజోలవమునకై
నవ్యవసంతా !



# ఓ మహారాజ్ఞి

వీతవిరహ జరామృత్యు భీతికమ్ము
అపహతాంధతమ స్మితారాంచితమ్ము
ఒక మహానంద సీమసాక్షాత్కరించె
ఓ మహారాజ్ఞి నీకటాక్షామృతమున !
నిర్మల గభీరనయన కనీనికాళి
నీలనిర్మల మృదుమంద చాలనముల
జూచునప్పుడెల్ల నాలోన దోచుదేవి !
తారక లమేయ భయదాంధకారములును
నిత్య చైతన్యములనంత నృత్యములని.
ఎన్నడో నామహాధ్వావసాన వేళ
ఆశమాత్రము నీ పరస్పర్శ కాని,
ఇందు నర్తింతు నేమహానందపరత
భువనమిది పాదరేణువిభూషితమని.



# వల్లకీ భావన

జలజలస్వర దివ్యకుసుమాం
జలుల వీణియ జిమ్మెనో!
వైణికుని మంత్రాక్షరావళి
వర్షమే నను గ్రమ్మెనో
అచట దారయు లేదు; సర్వము
నాస్తియొక శాంతాంధ కారములో
మృదుమధుర వీణారవమ్ములె
హృదయమున మెరసెన్.

నలుగడల దామసిని గాలిచి
గాలి వీవగ రాజియెగిరే
మెరయు మిణుగుఱు బురువులై బం
గారువానల జల్లులై.

రాగిణులు చరణాంగుళీ నీ
రాజితారుణ తంత్రులై;
కురుల ముత్తెపు సరులుగుల దాం
దరగ దిగి రుస్మత్తులై;
కేలదెలి మేల్మసుగు కంకణ
జాల రాగారుణితమై
తళతళని మెరయుంగ దిరిగిరి
గళచలన్మందారలై;

మృదులపాద నినాద గుంఫిత
మధురగీతీ మాలలే
పాదపూజాతరళ హారో
పాయనములయ్యెన్
పాయనమ్ములయ్యెన్
మరల గానవిరామముల దాం
దరగ వీణియ తీవలన్
చీరచెరగుల జిక్కు దెమలిచి
పరువిడిరి యెటకో !

నేల నొయ్యారముగదిగి,
మెలమెల్ల నెగురుచు బల్లటిలి కర
తాళముల బరువిడుకపోతీ
జాలమాలికలై;
కదల బొడిచిన తేనెపట్టుల
గదలి జుమ్మని రేగి వేగమె
మెల్లజేరెడు తేనెటీగల
పోలె రవళులు మూగగన్;

లోకమంతయు గానరసక
ల్లోలములు మెలమెల్ల దేలెను;
వరద వెల్లువ మునిగి తేలే
తరునికరమువలెన్.



# నిరీక్షణము

జీవితాశామహోదయ శ్రీ! కరాళ,
మృత్యుబాధామయీ! జీవ నిత్యశాంతి,
దేవి! అరుదెంతువే మణినావయందో!
నా హృదయరక్తతటినీ ప్రవాహగతిని
అంత నా దాహశీల హృదంతరాళ
జీవకణరాశియెల్ల నుజ్జీవితమయి
బ్రతుకు బ్రతుకెల్ల హాయిగా నేతురాయి
పూలమృదుశయ్యయో అయిపోవు దేవి!

ఆచిరాగమశాంత సాయాహ్నవేళ!
నీ చలాంశుకధూళికై వేచి వేచి,
అలసి తోడిమల వ్రేలు నా అరుణ నయన
చంద్రకాంతాలు రాలు నీ చరణయుగళి.



# ఈ కుటీరమ్ము

ఈకుటీరమ్ము గోదావరీ ప్రవాహ
నీరమున నర్ధమగ్నమ్ము నేడొ రేపొ,
తేలియేపోవు నే దూరతీరమునకొ,
గళితకాష్ఠాల నాత్మకాంక్షల మిగిల్చి,
చలదనిలధాటి పక్షాంతములు చలింప,
శీర్ణపర్ణమ్ము లాశాంతసీమ నెగుర,
వణకు నిది గౌతమీమహోవాతహతికి
ధర్షన విహీనజరఠగృద్ధ్రమ్ముభాతి,
అనిశబంధీకృతాంధ జంఝానిలములు
హోరుమను భీకరాక్రందనారవముల
అపహతజ్యోతు లంధకారావృతములు
చిల్లుపడిపోయినవి గవాక్షేక్షణములు
కీర్ణనీలాభ్రకుంతలా! శీర్ణవసన,
దిగ్దిగంతాంతరోదినీ దేవి వర్ష
రమ్ము వర్షింపు మీ విశీర్ణగృహమున!
రమ్ము సుస్వాగత మ్మర్ధరాత్రివేళ!



# రోడ్డు పక్కన

రోడ్డుపక్కన చింత, ఎగిరే
ఎర్రకంకర కెర్ర బారినది!
గుడ్డపేలికలవలె కొంగలు
కునికిపడినవి చింతకొమ్మల్లో

మండు వేసగియెండ మిటమిట
మండినది ఆమిట్టమధ్యాహ్నం
మెతుకులై ఆయెండకాంతులు
మెరిసె నీడల్లో

మేకపిల్లలు సగముకన్నులు
మూసి నెమరులు వేసెను
చెవికొసల చినిచిన్ని నీడలు
చెదరినవి మెలమెల్లగా;

కుడితిగోలెం కొసను నిలిచే
కావుకావని కాకి కూసినది.
కొమ్మసందుల నిలిచి జోగే
కొంగనిద్దుర కూతకూసినది.

పిట్టగోడను పట్టిపోయే
పిల్లి నాలిక మూతి తుడిచింది
తొండ తన మెడయెత్తి మరిమరి
తొంగిచూచిందూరికే!

ఇళ్లుగుడిసెలు ఎండధాటికి
కళ్లుమూసిన వేళలో
దూరమున కంసాలిపిట్టే
మారుమ్రోగినది

చింకిపాతల తల్లిఒడిలో
చింతనీడల చిన్నిపాపే
చించుకొని ఏడ్చేటిపాపే
పోరుపట్టింది.

పిల్ల ఏడిచి ఏడ్చి పాపం
తల్లికన్నుల వేడికన్నీరే
అప్పుడప్పుడు తాగి కొంచెము
చప్పరించేది.

కడుపు ఆకలిమంటతోనే
కంది కనలిన కాళ్ళతోనే
ఏడ్చిఏడ్చిన శోషతోనే
నిదురపోయేది!

మనిషిఏలే రాజ్యముందే
మనిషిపెంచిన చింతకిందే!
మనిషిశిశువే కడుపుచిచ్చుకు
మాడి ఏడ్చింది!



# శ్రీ రమణ మహర్షి

ఓ యుగవల్లీ చిరదిన సం
పూర్ణ వికచమనుజముకుళ !
ఓ పృథ్వీగళిత శాంత
స్వర్లోకోద్యానవకుళ !
ఓ అరుణాచలశిఖరాం
చల నృత్యద్దివ్యదీప్తి !
ఓ అరుణేశ్వరదేవళ
ఘంటారవ శాంతమూర్తి !

* * *

పవనినాద పతనహీన
మానవసామ్రాజ్య భవన !
మాయాబర్హాంచితకర !
కాలదివ్యలాస్యేందిర
క్షుభిత నృత్తగతులమాని
స్తిమిత నయనముద్ర బూని
నిశ్చల నీరాజనమున
నిలిచె నీ సమ్ముఖమున
నీరాజన సంప్రఫుల్ల
హార తారకాసుమమ్ముల !

* * *

కాలశ్రీ పదహతములు
గోళవహ్నికందుకములు
చిరయుగశతసహస్రముల
విరతిరహితగతిశతముల
గిరగిరగిర తిరిగితిరిగి
చరణకిరణ శాంతినాగి.
నిలిపె నీసమాధి శాంత
దీపావళి సాంధ్యవేళ
నీయనంత విశ్వగేహ
దేహాళికా దీపమాల !

*          *          *

నీ ప్రశాంత నయన యుగళ
నిశ్చల నీలాంచలముల
నీలి నిదుర తెర మెలమెల
మెలకువ తొలగించువేళ,
సుప్రభాత లక్ష్మినయ
నప్రవేశ హాస్య వేళ
పిచుకలు కలకల రవములు
జారుపసడి వరివెన్నెల
తురుతురుమను నునురెక్కల

చీపురుల తళతళ మెరపుల
పరువు లిడును భవదుటజ
ప్రాంగణమున పాపలవలె
అమరాంజలి హస్తగళిత
హైమ, పుష్పధారలవలె !

* * *

కుపితపన్న గోర్ధ్వఫణా
కుల జిహ్వా చంచలములు
సాయం ప్రజ్వలితారుణ
సంధ్యాహోమాగ్ని శిఖలు,
భవన్నయన దేవళ గ
ర్భాలయ శాంతాంతరాళ
వేదికలం దరుణకాంతి
దీపిక లర్పించువేళ,
గోవుల చలకర్ణమ్ముల
నిర్నిమేష నీలాక్షుల
నీ దృగంతరాళవిశ్వ
నీరవ జీవన రహస్య
మరసి యరసి కనుగొలకుల
కురియును ప్రమోదాశ్రుల

నోరులజారిన నెమరుల
తృణకణములు మెల్లమెల్ల
మందమంద నిశ్వాస వి
మలవాత నిహతుల రాల !

*　　　*　　　*

సాయంప్రాతస్సంధ్యల
సర్వాశ్రమవృక్షరాసి,
ఛాయా సాష్టాంగనమస్కృతి
నానర్చు మానసపూజ,
పూర్వపశ్చిమాశాంతర
సర్వదేశ శిష్యసమితి
నిలుచు విస్మృతాత్మాంతర
వినమితో త్తమాంగవినతి.

ఉడుతలు పాపలు పిచుకలు
కపు లంధులు వికలాంగులు
మహారాజరాజసుతులు
మహితత్కుజ్జ్వాలార్తులు
నీ కరుణాశ్రమగభీర
నిశ్చల కాసారాంతర

జలముల నిశ్శబ్దగతుల
నిలుతురు పసిమీనులవలె.

*           *           *

ఏనవలో కాంతమధుర
పుణ్యతూర్యనాద లవమొ!
మానవలోకాన జనుల
వీనులబడి మ్రోయునేడు;
తారా తారాంతరగత
తమో యవనికాంతరమున!
విద్యుచ్ఛల కేతు లలిత
వియ దుచ్ఛ రథాంతరమున!

*           *           *

లేదునీకు జీవనదీ
చర మారుణ మరణసంధ్య;
లేదునీకు రోగజరా
భైరవ నరలోకరథ్య;
యాతనా జలూకాచిర
పీతగళద్రుధిరధార.
దూరాశా బహువిహంగ
మారవ స్రుతాశ్రుధారన్

నీరవకము లోకము
నిలిచెం గ్రీనీడవిధము !
భవదున్నత మహాశ్శిఖర
భయసమర్పితా లోకము !

*   *

పశ్చిమ దిగ్భువనాంగణ
భయద యుద్ధభేరీధ్వని,
పూర్వ దిక్కుటీరోదర
దరిద్ర క్షుధార్త ధ్వానిన్,
కలచు మాహృదర్ణవాల
భయ బడబానలజ్వాల
లోకశోక భారతవినత
నయనకరుణ బాష్పవర్షి !
భారత చిరపుణ్య ఫలిత !
ఓరమణా ఓమహర్షి !
నీమహాదోంకారదివ్య
హైమవల్లకీ నివదము:
మామనుష్య లోకాంధ గు
హాముఖమున వర్షింపుము !



# శ్రీ జనార్దనరాయ సంస్మృతి

పోయితివీవు కార్తికపు బున్నమరేయి విభాతచంద్రికా
చ్ఛాయల దివ్యశోభవలె శాంతమనోజ్ఞ నిమేషమూర్తివై
నాయెద శూన్యమై చను సనాగతముంబడి మొత్తువాసలో
హోయని మ్రోయు నంధనిశినొక్కఁ విశీర్ణవృషోఢయానమై.

హృదయము విప్పికోనిక మరెవ్వరు నాకిట జీవితమ్ములో
సదయత ద్రవ్విపోయితి వసంతగభీరము నీయఘాతముం
బ్రదుకు భరింపరానియెదో భారమునంబడి కూలుశూన్యమై
కదలగబోయి కూలబడు కన్నులు చిల్లులు వోవుతామసిన్.

నీవు గతించినావుగద నిల్వదు జీవనమో నిమేషముం
బోవుమహాప్రవాహగతి బోయిన నీకయి యాగిచూడకే,
శ్రావణసాంధ్యవేళ వికసన్మృదు చంద్రిక జంద్రకాంతముల్
పూవుల గుల్కు వీధికడ మ్రోయును బాలుర ఖేలనధ్వనుల్.

భోరనువర్ష ధారల నభోంగణమెల్ల వినిద్రవాయుగం
భీరమహార్త రోదనల భీకరసంహతి మ్రోయు రేలలో,
ద్వారము జేరి యాకరిన ధారల నీ వెటనిద్రగొందువో
నీరవమూర్తివై యెచట నిల్చెదవో యని తల్లడిల్లెదన్.

బ్రతికిన కొన్నినాళులు నపార కవిత్వకళామహాత్తపో
వ్రతమున బద్ధకంకణతవర్తిలి వాఙ్మయ యజ్ఞవేదినా
హుతియయిపోయినావెటొమహాోనతమూర్తివిమేముమాత్రమే
యతుకులబొంతలీ బ్రదుకులట్టులె యీడ్తుము శుష్కవీథులన్.

ఎరుగుదు నేను మృత్యునిగృహీతులమేయమహాంధకారసా
గరమునమున్గి యింకమరి కానగరారని; కాని యేలనో
మరియొకమారువచ్చి యిటమమ్ముల నందరనూరడింపకే
యరుగవటంచు నాహృదయ మాశలతో బరువెత్తునారకే!

ఏలవచింతుమే మది గతించితి పీవని సంతతార్తి నీ
లీల పదేపదే మృతియె లేదు రసోల్బణమూర్తి నీకికం
గాల మహాపగాశ్రుజల కశ్మల పూరము నీ సుధాస్మృతిం
గోలున నేడ్చు దత్తటి నగోచరమూర్తిని వెల్గ నీకునై.

మెల్ల దురాయి లేజివురు మేలిమిబంగరు సంజవెల్గులం
దల్లలనాడువేళ వికచారుణ శయ్యలనో శయింతు వీ
వల్లన దాళ్ళనాడు చిగురాకులహారుల నాలకించుచుం
జల్లని పిల్లతెమ్మెరల చాయలనో విహరింతు నిత్యమున్.

పోవును ధూళిలో గలసిపోవు మనోహర సౌహృదమ్ము లీ
జీవనరాత్రి దీపికలు చిన్నియెడందల నూత్నయౌవనా
శావహరాగలాస్యములు నట్టులె వెల్వెలబారునంతలో
నే వినశింపవీకనుల నిట్టులు బాష్పజలమ్ము నింపకే.

ఎన్నడుబోని యీవిధివిధించిన మృత్యుకఠోర సేతువే
భిన్నముసేసి, కాలమయ భీకర వార్ధిగభీరవారిలో
ఛిన్నవిశీర్ణమైన మన చిన్ని యెడందలరాగహీర మిం
కెన్ని యుగాలకో మఱల నిర్వ్యారముంగని నిశ్వసించుటల్.



## దీపావళీ నిశీధము

ఈ ప్రకాశోగ్రహాసమ్ము లిందునందు
ఈ గభీరనినాదమ్ము లీ ప్రశాంతి
మరల దూరాన మందమందారవముల
గుసగుసలు దూరదీపికాంకూరమాల
అంతరమ్మున బాల్య దీపావళీ ప్ర
హాసముల మేలుకొలుప బాష్పాంకురముల
కనులనిండించు నానాటి కౌతుకములు
ఆ నశించిన దివ్యదీపావళులును!



# జననీ!

నిండు వేడుక బొమ్మల పండుగ యని
తోడివారలు బొమ్మలతోడ నాడ,
ఏను నామూర్తి నెద ప్రతిష్ఠించుకొంటి
నిల్పితిని మ్రోల రాలు కన్నీటిపూల !

అంతలో నీవు నిఖిల విశ్వైకజననీ !
మూర్తి నవలకుద్రోసి సమ్ముఖమునందె
కనులు మిరుమిట్లు గొలుప సాక్షాత్కరించి
చిరుతపాపని కరములే నరికినావు !

ఖండితము రుచిపూరసంక్రాంతము నగు
మొండిచేదోయి నంజలిమోడ్చి, జనని,
ధారలుబాష్పాల నీ కన్నుదోయి నరసి
బొమ్మయని యేడ్చినాను పాదమ్ములబడి !



# ఓ జలద!

రావోయి ఓజలద! రావోయి నాథా!
ఈ రేయి నీ కోరకె యేరై కరగు బ్రదుకు
ఏ యనిల మనిపెనో నీ. యాగమనవార్త
'హో' యనుచు నినె బిల్చు నీయామినీయమున
ఎవరి కెరిగింతు నన్నెవరు కరుణింతురిక
నీవె యెరుగుదువు నా జీవనాంతర్జ్వాల!

*  *  *

బిళ్ళగన్నెరుకన్నెకళ్లు మెరపుల మెరయ
జల్లుమని జీవితమ్మెల్ల పులకలపూయు,
రావోయి ఓజలద! రావోయి నాథా!
ఈ రేయి నీకోరకె యేరై కరగు బ్రదుకు!



# ఉ ష శ్రీ

ప్రొజ్జ్వలజదళశాంతి !
హే ఉషోరథకాంతి !
తెరచిరమ్మొక్కవేళ
దీనదుర్దినశాల !
జీవన దిశాంగణము
చైతన్య తరళితము !
వాయువసనాంచలము
వకుళదళ సురభిళము
ఈనవోదయవేళ !
ఏంమరుణ లోకాల
మందార వర్షాలో,
మా నయనముల రాలు
కాంతికల్లోలికల
కనులు కలలై తేలు !
మృదుసుఖాం దోళికల
హృదయ తంత్రులుసోలు !
చంచల విలాసినీ !
సౌందర్య బర్హిణీ

ఓ హృదయ వల్లకీ!
ఓ ఉదయ నర్తకీ!
రవితురగముల హేష
రథఘంటికల ఘోష
సప్తజలధుల మ్రోయ
సుప్తవిహగము లెగయ
తెరచి రశ్మి వేళ
దీనదుర్దిన శాల!
హే ఉషోరథ కాంతి
హృదపార విశ్రాంతి!



# శ్రీ రామారాయ సంస్మృతి!

ఓ సౌందర్యమయ ప్రపంచనిలయా! ఓ శ్రీకళాదేవతా
వాసీభూతహృదంతరా! మహితభావా! చిత్రకారాగ్రణీ!
ఈసాయంతనవేళ మాకరములం దీకావ్య పూజాంజలి
న్నీసాన్నిధ్య మలంకరింపగ బ్రభల్ సిందూర విచ్చేయుమా!

కలకలలాడు రేఖలవికాసములో మృదువర్ణదీపికా
జ్వాలనములన్ రచించితివి శాశ్వతసుందరతాప్రపంచము
ల్గలలవలె న్నిరంతర మఖండ తపోనియతిం భజించి ఓ
లలితకళాతపస్వి సఫలమ్మిలలో భవదీయ జన్మమే!

సుందర వర్ణచిత్రముల శోభల నాంధ్ర కళాధిదేవతా
నందవిచిత్ర లాస్యము లనంతములై వెలిగెన్నిరంగులై
అందనిదా కరాంగుళి కళాద్భుత కౌశలమొక్కసారి మి
న్నంది నశించిపోయెగద! ఆంధ్రుల ఆశలతో క్షణమ్ములో!

ఓ కమనీయతా రస మహోదధి! నీ రచన ల్గనంగ జా
లైకరగున్ హృదంతరము లంతన శాంతనిమీలితమ్ములై
లోకము మాత్రమేక్షణములో నాకమూల్యము గట్టిపోవు
వో కొలబద్దలం గొలిచి యూహల కందని నీమహత్త్వమున్

ఇదికలగించు మా మది నా కేషధి నీ మహనీయ చిత్రమే
యదియొ రచింపబూనఁ గొనునంత నె ఆవిధి మ్రింగిపోయె న
న్నదిస విషాదచింత; ఒక ఆశయమేని ఫలింప నోచుకో
నిదికద ! ఆంధ్ర జాతి, ఇది ఏ దుర్దృష్ట మహావిపాకమో !

చింతలకేమిలే విధివిచిత్రము ! మాయిహలోకదుఃఖమొ
క్కింతయు జేరనేరని మహేంద్రదివమ్మె భవన్నివాసమో
వంతలతో, విషాదకరవాంఛలతో స్మరియించుమమ్ము మ
న్నింతువుగాక ! నీమదిగణింపకె మాయపరాధవేశమున్ !

నీవు గతించినావను వినిశ్చితబుద్ధివహించి లోకమా
యా విధులందలంచు నిను నంతియు కాక, కళాతపోవిధిం
భావితసుందరేశ్వర విభావము నీమహితాత్మమృత్యు సం
భావనకైన నందదనువార్త జగమ్మెరుగంగనేర్చునో !

ఒకపరి నామహోమయ మహోజ్జ్వల లోకమునుండివచ్చి నీ
వికసిత కౌముదీరుచిరవీక్షణ మెల్లడబర్వినంత మా
సకలహృదంతరమ్ములు వెసంగళలన్ వికసించిపోవ, సా
ర్థకమొనరింపుమీ స్మృతికరమ్ము మహాక్షణముం గృపామతిన్.



# మరణతరణి!

నీవోక పరమావధివై
జీవితాంతి మాతిథివై
అరుదెంతువో మరణతరుణి!
కరుణింతువో భవతారిణి!
తరుగని యీజలనిధిలో
ఎరుగని ఏసుఖతీరము
చేర్చునో నీచిత్రనౌక!
చిరవిషాద జయపతాక!
ఏప్రేమ రహస్యబాధ
ఏజీవనచిత్రగాథ,
వీనుల నాసాంధ్యవేళ
వివరింతువో! మురళిలీల!
ఆ ప్రశాంత సుప్తరాత్రి!
మదె మన నిశ్శబ్దయాత్ర!
ఆ పూర్వస్మృతు లికేల!
ఆశాభంగము లికేల!
సర్వేంద్రియ సుప్తిమయీ!
సకలభావశాంతిమయీ!

నీ పవిత్ర సన్నిధిలో
        నీ దరసుస్మితరుచిలో
స్మృతిదుర్భర భరమో దించి,
        శేష హృదయసుమ ముద్రించి,
అర్చింతును నీపదమ్ము
        ఆనంద నవోదయమ్ము
అరుదెంతువో మరణతరుణి!
        కరుణింతువో భవతారిణి!
నీవొక పరమావధివై
        జీవితాంతి మాతిధివై!



# వర్షాసంధ్య

నీలాభ్రసాంద్ర వియదంతర 'మెల్లెడన్ నా
డేలో వలాహక జలాశ్రులవృష్టి గ్రమ్మెన్,
కాలాంత వేళవరకుం గగనమ్ము వర్షా
జాలమ్ము వేయులమునో యనిపించె నాలో !

సాయంతనారుణిమ గ్రమ్మిన సాంధ్యవర్షా
తోయమ్ములం దొలికె గుంకుమరాగశోభల్,
గోదావరీ సలిలఘోషలలో బలాకా
నాదమ్ములో పిలుపులో వినిపించె నేవో !

వీధుల్ మనుష్యరహితమ్ములు; జాలులై వాః
పూరమ్ములంత గనుచీకటి బ్రాకిపోయెన్;
పాథోలవమ్ముల గృహమ్ముల జారె నందం
దారావముల్ శ్రుతులకింపులు గొల్పె లోలో !

ధూమమ్ములుం గృహములం దెగిరెన్నభోగా
యన్మారుతమ్ముల జరించుచు జిత్రరీతిన్;
భూమింగడుం బరువిడె న్నవమేఘబృంద
శ్యామాకృతుల్ విశదవాతెతమ్ముంమన్ !

నీపమ్ములం బరిమళమ్ముల మంచిముత్యా
లై పూలు సెజ్జలుగదాలెను మెల్లమెల్లన్;
సంపూర్ణసుందరములై తెలిచంద్రకాంతా
లుం బూవుల న్మైరయు దీపికలై జ్వలించెన్!

ఆ రమ్యవేళ దమవత్సలు బాలుద్రావం
ద్వారమ్ములం దజముఖున్ శయనించి, నిద్రా
భారార్ధసంకుచితదృష్టుల మందరోమం
థారంభముల్ నెరపుచుం గదలించె నోరుల్!

ఆసాంధ్య సుందరత, ఆచలవారి వాహో
భాసమ్ములుం గనులలో యమునానదీ సం
కాశమ్ములై బరువులై ప్రవహింప, దూరా
కాశమ్ము శాంతహిమ శైలమువోలె నిల్చెన్!

ఆ వేళ నాహృదయమే సకల ప్రపంచ
మ్మై, వార్షమేఘములు గ్రమ్మినరీతి దోచెన్!
ఆ వారిధార లవి సంజియ వెల్గుల న్నా
లో వానకాల్వల విధమ్మున మ్రోగి నిండెన్!

ఆచారుతామధు ముదమ్మున నంతనంతం
దోచెం గతమ్ములు బురాతన నీలవర్షా
రోచిర్విలాసములు సాచలవారిధారా
వీచీభుజంగమ గతమ్ముల వక్రరేఖల్!

అందందు బాలికలు నీళులనాడ వేళా
సౌందర్యముల్ మరలరాని తదీయహాసా
నందమ్ములా లలితబాల్య విలాసమాయా
చందమ్ములై మెరసి నెమ్మదిలో వెలింగెన్!

ఆశావిహంగముల కందని ఆపురావ
ర్షాసుందరాకృతుల నీక్షణవారిధారా
ఘోషమ్ములం గనుల కందని భావిసీలా
శా శోభలందలచి నాహృది నిశ్శ్వసించెన్!

ఎందో మరెన్ని దివసమ్ములకోగదా నా
డెందమ్ము, లోచనములం బ్రతిబింబితమ్మౌ
సౌందర్యధార ప్రవహించిన దారినేయా
నందైకవార్నిధి మునుంగు మహోత్సవమ్మున్.



## "వసంతతిలక"

ఓ సుందరీ నవవికస్వరచారుతా జ్వా
లాశాలినీ ! లలితకుంతల నీలపాలా !
నీవెవ్వరోకద! ఒహో అమృతాంశలోక
మ్మావిర్భవించి వికసించెను నేడు నాలో !

ఏలో అపూర్వ భవదాకృతిలోలలోల
మ్మాకుంకుమారుణ హృదంతర జీవరేణూ
జాలమ్ము మెల్లవిరియున్న వశోణమందా
రాకారమై మృదుసుఖానిల చంచలమ్మై !

నీ సుందరాకృతి మహోదయవేళ నాలో
సర్వేంద్రియమ్ములు విహంగమపాళిలీలన్
ఆశాంతరాళములలో విహరించు నెన్నో
నిర్వాణముల్ కలకలమ్ములతో ధ్వనింపన్ !

నీ మోహనాకృతి యెదో కమనీయరాగ
మ్మై మ్రోయు నొక్కపుడు నాయెద లీనమౌచున్;
నీ చారుతానిలము సోకి తరంగితమ్మై
లేచున్ హృదంతర మొకంత మహాబ్ధిలోలెన్!

నా జీవితమ్మున, ప్రతీహృదయాంతరాళ
ధ్వానమ్మునొక్కగతి నీవిధి, ప్రశ్న వేయున్

ఓ జీవనైకనిధి ఓ తరుణీ త్వదంత
ర్లీనార్థమేదో కద ! నీప్రణయార్థమేదో !
ఓ కౌముదీమయి యిదే గ్రహియించితి న్ని
న్నీ కౌగిలింతనని నేననుకొందుగానీ,
నీవో నిరంతరము నాకు లభింపరాని
శ్రీవై వసింతు వమరోపవనమ్ములందే!
కర్పూరహారతివలెం గమనీయ తేజో
వృత్తమ్ములన్ వెలుగుచుందువు కన్నుదోయిన్
క్రీనీడనై వెలుగు ని న్నరయంగలేకే
నిత్యమ్ము నీపదతలమ్మున దొర్లిపోదున్ !
ఈ జీవయాత్ర యెదో యీ బ్రదుకేమొగానీ,
సర్వమ్ము లోకమొక సంశయమై కలంచున్
ఏదో మహార్ణవము ఘోషమృగేంద్రగర్జా
సంకాశమై భయదమై యెదలో ధ్వనించున్ !
ఎవ్వారు నాహృదయవేదన దీర్పనేలే
రివ్వేళ నా బ్రదుకు శాంతి సుఖాలదేలన్
నాజీవయాత్ర సఫలమ్మొనరింప నీవే
ఓజీవనైకతరణీ ! కరుణింపు దేవీ !



# శుక్తి

అతిమహోన్నత హిమవన్నగాగ్ర శిఖర
మకుటమాణిక్య దివ్యతారకవునీషు
ఇమ్మహా విశ్వశుక్తి గర్భమ్మై పండి
చిన్నిముత్తెమ్ము నిన్ను సృజించుకొనియొ ?

ఏ నతులహర్ష విస్ఫారితేక్షణముల
నీ తరళమూర్తి సన్నిధి న్నిలుచు నంత
కోటిసాగర గంభీరఘోషణమున
అరచె నెదో జన్మజన్మాంత రానుభూతి !



# "వంశగీత"

ఈవైపు నొకకొండ ఆవైపు నొకకొండ
మండు వేసగి ఎండ రెండిటికీ నడుమ
కొండచిల వన్నటులు పండుకొన్నది దారి;
దానికిరువైపులం దట్టమగునడవిలో
ఒళ్లంత పూలతంగేళ్ళు చిరుగాలిలో
పొంగు బంగరు తరంగాలవలె ఉరికినవి;
ఎండకొమ్మల నడుమనుండి వెన్నెలవోలె
వెండినాణెము లెన్నివేలొ కురిసినది.
కొండచరియల మేయు మందలో తప్పెనో!
చిరునాల్క చివురుతో మెరయు మునిపండ్లతో
మేకపిల్లపుడపుడు 'మే' యనుచు నరచినది
పక్క గలగలను సెలపాటతో శృతిగలిపి
మొగలి త్రాచులు పడగ ముడివిప్పి యాడినన్
వెదురు పొద లీ పాట విసిరి పాడినవి
తుదిలేని దారిలో నిదురించు లోయ
వడివడిగ నడచు నీయడుగు తడబాటులో
పద నినాదమ్ము లే పకపకని నవ్వగన్
ఎందాక నడతువో ఇక చాలునో
ఇచట మన మిరువురము నీ జీవిత
పాడుకొని కరగి మనపాటలో నేకమై
తుదకచట లోయలో నిదురింతమా!



# వసంతనృత్యము

మరల తరళ నవవసంత
మరుగుదెంచె తరుల నోహో!
అరుణారుణ కిసలయముల
చరణాంగుళి విలసనముల!

ధూళులై గిరగిర తిరిగెను
రాలిన దళములై యెగిరెను!
తాళవ నానిల చలనము!
చాలిత కోకిల స్వనము!
బాల బాలిక లోహో రండు
పూలవల్లిక లోహో రండు!

మరల తరళ నవ వసంత
మరుగు దెంచె తరుల నోహో
అరుణారుణ కిసలయముల
చరణాంగుళి విలసనముల!

పావన వన పథిక సఖా!
జీవన మధురసిక సఖా!
పరుగు పరుగు నరుగు దెమ్ము
తరలినది మధూత్సవమ్ము
కదలిన నిమిషమ్ము వమ్ము
బ్రదుకిది యొక ఖేలనమ్ము

మరల తరళ నవ వసంత
మరుగుదెంచె తరులనోహో !
అరుణారుణ కిసలయముల !
చరణాంగుళి విలసనముల !

ఎవ్వరోహో ఎవరువారు !
ఎవ్వ రాలపించువారు!
ఈ విషాదమురళి యేల !
ఈ వసంత నృత్య వేళ !
దవ్వు దవులనుండి రండు !
నవ్వుమొగము లోలయురండు

మరల తరళ నవ వసంత
మరుగుదెంచె తరుల నోహో
అరుణారుణ కిసలయముల !
చరణాంగుళి విలసనముల !



# దుఃఖాశ్రువులం!

రమ్యసఖా! చాలు చాలు!
ఇమ్మహా నిరీక్షణములు
వమ్మయిపోయెను తలపులు
క్రమ్మె చిమ్మచీకటులిల

ఏల మరి సముద్రయాన
మెంతకాల మన్వేషణ!
పోయినమణి మరి దొరకున!
ఈ యగాధసాగరమున!

రమ్యసఖా చాలుచాలు
ఇమ్మహానిరీక్షణములు
వమ్మయి పోయెను తలపులు
క్రమ్మెచిమ్మ చీకటులిల!

తలచితి వకటా ఎదలో
ఎలప్రాయము పొంగులలో
జలధి యింద్రనిలమున నె
వలపుల మా లల్లుదునని!

రమ్ముసఖా చాలుచాలు
ఇమ్మహా నిరీక్షణములు
వమ్మయి పోయెను తలుపులు
కమ్మె చిమ్మచీకటు లిల !

మేరుమణియె జారెనుగద !
హారమేల పోదముపద !
తీరమైన దెలియదు గద !
తారమైన మెరయదు గద !

రమ్ముసఖా చాలుచాలు
ఇమ్మహా నిరీక్షణములు
వమ్మయిపోయెను తలపులు
కమ్మె చిమ్మచీకలు లిల !



# హృదయసఖా!

అంతరచిర హృదయసఖా
అంధకార సహపథికా!
అంధులమై తెరువెరుగని
పాంథుల దరిజేర్చెదవో!

ఎదొంతరంగ వికృతహాస
మెదియొ భయదజలధిఘోః
బుసలు విసరు జంఝానిల
మసితజలదఫణాగ్రముల!
తారలొక్కటొక్కటిగనె
ఆరి అంధకారమగునొ!
తీరము నిర్మానుష్యము
పారమెదో యెరుగలేము!

అంతరచిర హృదయ సఖా!
అంధకార సహపథికా!
అంధులమై తెరు వెరుగని
పాంథుల దరిజేర్చెదవో!

బ్రదుకు కనులు చిల్లులుపడి
ఎదశిలమొ చతికిలబడి

ఎవరికయి నివేదింతుము
హృదయ విషాదోదంతము !
రత్నముల ధరించుకొరకు
యత్నము వమ్మయ్యెతుదకు
మహితజలధి తీరముననె
దహియించు పిపాసయెదనె !

అంతరచిర హృదయసఖా
అంధకార సహపథికా !
అంధులమై తెరువెరుగని
పాంథుల దరిజేర్చెదవో !



# ప్రేమమందారము

నీ మనోదళ సురభిళము
ప్రేమతరుణమందారము
కోయబోయె దెవరికయి ఓ
హాయి రాగముగ్ధహృదయ !

మాలనల్ల గోరితివో
పూలపూజ నెంచితివో !
నీవుకోయదలచిననే
పూవు వాడిపోవుసుమీ !
ఓ కరుణామృదుహృదయ !
లోకమేమని తలచితివో !
కాలద్రొక్కి పోవుసుమ్ము !
నీలతాంత మృదురజమ్ము !

నీ మనోదళ సురభిళము
ప్రేమతరుణ మందారము
కోయబోయె దెవరికయి ఓ
హాయి రాగముగ్ధహృదయ !

ఈ నవ యౌవన వనిలో
ఏ యమరులు పూయించిరో !
పావన మందారకళిక !
జీవనపథ మణిదీపిక !
సకలజీవ సర్తనకై
ఒకమంగళ హారతియై !
ముకుళము వికసింపనిమ్ము
నఖముల ద్రుంపకుము రమ్ము !
నీ మనోదళ సురభిళము
ప్రేమతరుణ మందారము



# స్మృతి

నీ యౌవన సుమ నవనవహాసము
పోయె మరలరా దది నాకోసము !
అగణిత జగమ్ము లరిగనగానీ,
యుగయుగమ్ములుం దొరలినగానీ
జీవనమే వెనుదిరిగినదని
నీవే ఒకపరి మెరిసితివని !
కలగంటిని నాలో గానీ !
విలపించితి మేల్కొని తరుణీ !
మరణమ్మొక రూపకమేయై
విరహమ్మొక యవనికయేయై !
తెరమరుగున మెరుపే నీవై
అరుదెంతువా పరువిడి నాకై
నీయౌవన సుమ నవనవహాసము
పోయెమరల రా దిక నాకోసము !
అగణితజగమ్ము లరిగినగానీ !
యుగయుగమ్ములుం దొరలినగానీ !
మనసేమో పసిపాపనివలె
అనుకొనునివి యేవో తానే
వినబడునా యెవ్వరికైనా
కనికరమున కనులు కరగునా !
నీ యౌవన సుమ నవనవహాసము ....



# శ్రీ రామమూర్తి సంస్మృతి

మీరుదివంగతాత్మకు లమేయ మహఃపరిలీన మానుషా
కారులటన్నవార్తవినగం దురదృష్ట హతమ్ము దేశ మె
వ్వారలు మార్గదర్శకులు భారతిసంస్కృతి సేయ నెవ్వ రు
న్నారని మా మనమ్ములు దినమ్ముదినమ్ము విషాద మందెడిన్.

ఆ మహనీయవాఙ్మయ రహస్య వివేచన దివ్యశక్తి భా
షామధనమ్ములో బ్రదుకు సర్వమఖండ తపస్య సేయు దీ
క్షామహితమ్ము యత్నము నచంచల చిత్రములీలదోచి యాం
ధ్రామృతమూర్తి! మిమ్ము హృదయమ్ము దలంపగ జేయు నిత్యమున్

కొమ్ములు దేరుపండితుల కోటులు మీపదధూళి మౌళి భా
గమ్ముల దాల్చి వాల్చిన మొగమ్ముల బోయిరి నిర్జితాత్ములై!
నెమ్మదిలో దలంతుము మనీషిమణీ! భవదీయ ధీర నా
మమ్ముదలంచినప్పు డధమమ్ము పతంజలి భాష్యకారులన్!

మీరు కృతార్థజీవనులు మీమహిమమ్మున నాంధ్రజాతి భా
షా రచనమ్ములో పరమసత్యమెరింగెను నవ్యసాహితీ
తారవెలింగె మీ కరుణ దాతలనాటి మృషా ప్రచారమా
ధారములేని గేహమువిధమ్మున గూలెను మీపదాహతిన్!

భాషయటన్న మాటకొకవర్ణపద క్రమమైనరానీ మా
యీపదభిజ్ఞ శేఖరుల యీ స్తుతినిందలకేమిగాని సం
పోషితవాఙ్మయాబ్ధి తమ పూనినయత్నము పూర్తిసేయు సం
తోషము లేకయే యకట! దుర్విధి మీకయివచ్చె నింతలో!

అవునిది కాదు కాదని అహంకృతి మోహితలోక మంథమా
నవహతపద్ధతిన్నడచునా! కలకాలము! మీజయమ్ము లో
కవిదితమై జనావళి శిఖామణియై నటియింపబోవు నా
దివసము రాకపోవునె సుధీపరమేశ్వర! ఆంధ్రజాతికై!

అంతములేని యజ్ఞత సహర్నిశలే మలయించినాము మీ
స్వాంతము నెంతయేని! మనసా క్షమియింపుడు; మీమనమ్ములో
శాంతిలభించుగావుత! యశస్వివరా! యికనుండి దివ్య లో
కాంతర నందనమ్మున నిరంతరముం జగదీశ్వరీ కృపన్!



# మలయమారుతము

మందమంద మలయానిలకుమార!
కుందమోహా నామోద మనోహార!
చల్లని నీ అలకలు సోకినవో
జల్లని తనుపులకలు ప్రాకెనోహో!

మెల్లన నామృదు శరీరమ్మల్లక
పిల్లతెమ్మెరల తోడిను పీడెనిక!
నాహృదంత రాంతరమే కరగెన్
ఓహో! నీ పరిమళమ్మై తిరిగెన్!

మందమంద మలయానిల కుమార!
మందార మరందారుణాధరా!

నాహృదయాంతర గళనాళిక లే
ఆహతవీణా చల తంత్రికలై
నీ వ్రేళులు పరువిడు కలకలమే
ఏవో పాటల పూలవర్షమై
నీపరువిడుదారుల కురియించెన్
నీపద యుగళి వకుళముల జల్లిల్

మందమంద మలయానిల కుమార!
కందళిత హృదను సుఖాంకురా!

నీచందన శీతలతాజలధిన్
తోఁచిమెరసె నానందమణిఖనుల్
నీమదమంద పరీమళగతులన్
నామది నీలి నిదుర తెర లలమెన్
లీల మహోత్సవమేదో వెలుగులన్
మేళతాళముల మెరసి చనెన్.

మందమంద మలయానిలకుమార!
సుందర సాగర శీకరహారా!
మంథర నిద్రామురళీ ధరకర!
కంధరాచల స్వప్న బర్హాధర!



# శ్రీ సీతాదేవికి

నీ వెవ్వరవో
జీవనగగనా
లోకధాత్రికా
త్రీక దీపికా !

ఈ జీర్ణకుటీరము లో
నా జీవన సంధ్యలలో
కామగవీథ్యృతరచిత
ప్రేమదీపిక వో వనిత !

నా మనో నిశీధినిలో
ప్రేమనందనవనిలో
అరుణచంద్ర కాంతసుమము
కరణి విరిసి మెరసెదు సుమి !

నీ కనుపాపల లో [illegible]
నాకను మిన్నులు [illegible]లెనో హా
ఏ కాలాది [illegible] !
నా కీ దినమే [illegible]

# యుద్ధఘోష

ప్రారంభించెన్ రుధిరవర్ణముల
ధరాప్రళయ యుద్ధాగ్నిజ్వాలలు
ఆ చో టదిగో మనుజద్వేష పి
శాచ భయంకర హుంకారధ్వని!
అంధకారమున హోరు హోరుమని
అదే అదే ఆమహాక్రందనము!
పేర్చినమనుష్య కంకాళమ్ముల
కూర్చిన వీ సామ్రాజ్య సౌధములు!
విసిరిన మానవ శల్యచూర్ణముల
వేడి వేడి బాధాశ్రుసీరముల
కలిపి రచించిన వెల్లలవెలుగుల
గగనోజ్వల సామ్రాజ్య సౌధములు!
అవిగో! అవిగో! ఫెళ ఫెళధ్వనుల
హాహాకారము లొనర్చుచున్నవి!
అవిగో! అవిగో! పునాదుల గదలి
అవి పాతాళాఖాతమ్ముందున్.

*  *  *  *

మనుష్యహింసాజయ స్తంభ రీ
తిని నిల్చిన ఆరాజ్యకుడ్యముల
ఛేదిల్లిన ఒకబీటమూల్గులలో,
భైరవవినాశ నిశ్శబ్దతలో,
వినుడు! వినుండవె! వినుండు! అవిగో!
దీన దరిద్ర క్షుధా క్రందనల
హీన నీరవగళాంతర ధ్వనులు!
పునాదులంబడి వినాశమందిన
అనేక దుర్బలమనుష్య సంఘ
ప్రాణనాశక శ్మశానశాంతత!

* * * *

మహామహిత సామ్రాజ్య శిఖర ని
ర్మాతలైన నరఘాతకులారా!
మనుష్య హృదయ రుధిరమద్యమ్ముల
మదించితిరి దురహంకృతి పరులై!
అదిగో ప్రళయజ్వాలా జిహ్వా మ
హాభీకరమై ఆక్రమించు మిము!

* * *

ప్రపంచమ్మున ప్రచండశక్తి
ప్రభంజనమ్ము ప్రళయనృత్యమేనా?

అంధబధిర మూకాదిమశక్తి మ
హాంధకార జడ తాండవమేనా?
ఆకాశమున ప్రతిధ్వనించిన
ఆక్రందన.కిక నిష్కృతి లేదా?
ఆ ప్రపంచనిర్భాగ్యాక్రోశ
మ్మాదరించువా రెవరున్నారో!
ఆ ప్రపంచదారుణ మారణఘో
షాలకించువా రెవరున్నారో!
ప్రారంభించిన దదే! అదే! ఆ
ప్రపంచయుద్ధాగ్ని పర్వతమ్మే
ప్రభిన్నమైన ఛ్ఛటచ్ఛటాధ్వని!
పాదదళిత నిర్భాగ్యజాతిసం
ప్రార్థనకై ఒకగళప్రతిధ్వని!
పది దిశాంతరమ్ముల వినబడియెన్!
దూరదూర శాంతి ప్రభాతభే
రీరవకల మంగళగళనినద
మ్మారంభించినదదే! అదే!



## శాంతి!

శాంతి! శాంతి! శాంతి! శాంతి!
శాంతిదేవతా! ప్రశాంతి!
కాల్చుప్రేవులజ్వాలకు
కమలిన ఉదరక్షుధార్తి,
కనుగూడుల మినుకు మినుకు
మను జీవన దీపకాంతి,
బ్రతుకొక దుర్భర భరమై
అతుకు టస్థిపంజరమై
ఎండలలో వీధులలో
మండియేడ్చు భిక్షుకులకు
శాంతి! శాంతి! శాంతి! శాంతి!
శాంతిదేవతా! ప్రశాంతి!
అందరాని వలపు మెరపు
చిందన చిరునగవు కొఱకు
హృదయమె ఉన్నంత వరకు
ఉదయమె ఉన్నంత వరకు
వెదకి వెదకి విసివి విసివి
పిలిచిపిలిచి అలసి సొలయు
కలవరింత కలల కింత

కలత నిదురకనుల కింత
శాంతి ! శాంతి ! శాంతి ! శాంతి !
శాంతి దేవతా ! ప్రశాంతి !
కడచి చనిన అమృతక్షణ
కల విహంగముల రవళికో!
వెక్కిరించు తీవ్రాశా
వికట పిశాచికల కొరకో !
వెర్రితలల మతములనీ,
వికృతపు దైవతములనీ,
మరుగు కొండమావులలో
పరువిడు నిర్భాగ్యులకో
శాంతిదేవతా ! ప్రశాంతి !
శాంతి ! శాంతి ! శాంతి !

*    *    *

